# ఆంధ్రమహిళ

ఏకైక మహిళాభ్యుదయ మాస పత్రిక

(8)



September 1962 ANDHRA MAHILA Price: 37 nP.

VOL: XVIII No. 9



# ఆంధ్ర మహిళ

ఏకైక మహిళాభ్యుదయ

మాస పత్రిక

శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్
వ్యవస్థాపకురాలు

ప్రకటనరేట్లు
(ఒకేరంగులో)

| | | | |
|---|---|---|---|
| నాలుగవ రేపరు పుట | ... | రూ. | 100/- |
| లోపలి రేపరు పుట (2, 3) | ... | ,, | 80/- |
| లోపలి సాదా పుట | ... | ,, | 60/- |
| లోపలి అర్ధ పుట | ... | ,, | 30/- |
| పావు పుట | ... | ,, | 15/- |

## విషయ సూచిక




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 18 :: సెప్టెంబరు 1962 :: సంచిక 9

# శ్రీమతి జాన్ మత్తాయ్

కేంద్ర సాంఘిక సంక్షేమశాఖ అధ్యక్షురాలి పదవిని శ్రీమతి అచ్చమ్మా జాన్‌మత్తాయ్ స్వీకరించడం అందరూ హర్షించ దగిన విషయం. శ్రీమతి జాన్‌మత్తాయ్ నలభై ఏళ్ళుగా సంక్షేమ కార్యక్రమాలలో అనేక విధాలుగా అనేక సంస్థలకి సేవచేశారు. కేరళరాష్ట్రంలో జన్మించిన యీమె, తిరువాన్‌కూర్‌లోనూ, కలకత్తాలోనూ విద్యాభ్యాసం చేసింది. కేరళలోని అనేక విద్యాసంస్థలకు ఈమె ప్రాతిపదిక వేసింది. తిరువూర్‌లోని బాలికామోదమను, విద్యాలయం ఈమె కృషివల్లనే నెలకొల్పి బాలికలకు విద్యయేగాక, వసతికూడా కల్పిస్తున్నది, ఈమె కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు సభ్యురాలేగాక బొంబాయిరాష్ట్రపు సాంఘిక సంక్షేమ శాఖ అధ్యక్షురాలు కూడాను.

1953లో స్థాపించబడిన సాంఘిక సంక్షేమశాఖ, 54 దాకా, కార్యరూపంలోకి రాలేదు. అష్టవర్షప్రాయంగల ఈ సాంఘిక సంక్షేమశాఖ, ఆసేతు హిమాచల పర్యంతరం ప్రతి రాష్ట్రంలో, కొండ ప్రాంతాల, గ్రామీణ ప్రాంతాల, పట్టణ ప్రాంతాల, కులమత విచక్షణ లేక ఎక్కడైతే సహాయసంపత్తులు కావాలో, ఆచోట్ల సేవాకేంద్రాలు నెలపి స్త్రీలకి, శిశువులకి ముఖ్యంగా సహాయం చేస్తున్నది. శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ అధ్యక్షపదవిలో ఈ సాంఘిక సంక్షేశాఖ, జననమొంది, పారాడి, అడుగులువేసి, పెరిగి నడక ఆరంభించి, అష్టవర్షబాల అయింది. ఆ ఏటికి కాపడు ప్రభుత్వం ఈ సంక్షేమశాఖ ఆవశ్యకతని గుర్తించి, క్రమంగా శాఖకై ఎక్కువ ధనం కేటాయిస్తూ వస్తున్నారు. ధనం సేకరించడంకంటే దానిని సద్వినియోగ పరచడంలో వ్యక్తికి విచక్షణా, బుద్ధి తీక్షణతా, నిజాయితీ, బాధ్యతా ఎక్కువగా అవసరం అవుతూంటవి. సంక్షేమశాఖకి కేటాయించిన ధనం, యింతవరకూ సద్వినియోగమే తప్ప, నిరుపయోగమవలేదు. శ్రీమతి జాన్‌మత్తాయ్‌మీద నెలకొల్పబడిన, ఈ పవిత్రభారాన్ని, సక్రమంగా నెరవేర్చడానికి భగవంతుడు ఆమెకి ఆయురారోగ్యాలని యివ్వాలని కోరుకుంటూ, ఆమెకి నూతన పదవి స్వీకరణ ప్రారంభాన మా శుభకాంక్షలు అందజేస్తున్నాము.

మాలతీ చందూర్
గౌరవ సంపాదకులు

# ఢిల్లీ విశేషాలు

ఢిల్లీలోని సోషల్ వర్క్ స్కూలు భవనానికి శంఖుస్థాపన జూలై 25 వ తేదీన జరిగింది. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ భవన శంఖుస్థాపన చేశాక సోషల్ వర్క్‌గురించి కొన్ని విషయాలు ప్రస్తావించారు. ఢిల్లీ యూనివర్సిటీ ఉపాధ్యక్షులు శ్రీ చింతామణి దేశముఖ్ ఈ సభకి అధ్యక్షత వహించారు.

ఆనాడు శ్రీమతి దేశముఖ్ వివరించిన కొన్ని విషయాలు, సంఘ సేవకులకీ, సేవాసంస్థలకీ చాలా వుపయోగకరంగావున్నాయి.

ఈ ఢిల్లీ స్కూలు పదహారేళ్ల క్రితం లక్నోలో అతి చిన్న సంస్థగా స్థాపించబడి, ఆతరువాత రెండేళ్లకు ఢిల్లీకి మార్చబడింది. ఢిల్లీలో ఈ పధ్నాలుగేళ్లపాటు, సరిఅయిన భవనం లేక ఏలాగో అలా కాలక్షేపం చేస్తోంది. ఈనాటికి ఈ సోషల్‌వర్క్ స్కూలు తమ స్వంత భవన నిర్మాణానికి పూనుకోడం అందరూ అభినందించవలసిన విషయం. ఈ స్కూలు చేస్తున్న అపారమైన సేవనుగుర్తించి, ఢిల్లీ యూనివర్సిటీ ఈ స్కూలు నిర్వహణ బాధ్యత స్వీకరించడానికి సమ్మతించారు.

సంఘసేవ అనునది విజ్ఞాన శాస్త్రమేకాక ఒక కళకూడాను. గత శతాబ్దంగా సంఘసేవ అనునది మానవ నాగరికతలో జన్మించిన కొత్త దృక్పధం. ఈ దృక్పథం, గత యాభై ఏళ్లలో పెరిగి, విస్తృతమయి అన్ని దేశాలలోనూ పునాదులు వేసికొని, దేశపాలనలో ముఖ్యాంశమయింది.

మనదేశంలో మొట్టమొదట సోషల్ వర్క్ స్కూలు 1936 లో స్థాపించబడింది. దేశం మొత్తంమీద వివిధ ప్రాంతాలలో 25 సోషల్ వర్క్ స్కూల్సు వున్నాయి. కాని ఈ స్కూళ్లు శిక్షణ విషయంలో, పరీక్షల విషయంలో, శిక్షణా కాలం విషయంలో ఒకదానితో ఒకటికి సంబంధం యాలకి మల్లేనే వీటికికూడా నికరమైన ప్రమాణాలు ఏర్పరచుకోడం ఎంతైనా అవసరం. సోషల్ వర్క్ స్కూలు, సాంఘిక సంక్షేమ కర్తలూకలిసి చేసి పరిశోధన ఫలితంగా ఈ సోషల్ వర్క్ స్కూలు యిరవైనాలుగు రకాల విధాలైన వృత్తి విద్యలని, సాంఘిక సంక్షేమానికి సంబంధించిన వృత్తులని గరపవచ్చునని నిర్ణయించారు. ఈ సోషల్ వర్క్ స్కూళ్లనుంచి శిక్షితులైన వారికి అనేక సంక్షేమ రంగాలలో, వుద్యోగాలు దొరుకుతున్నాయి.

మన దేశంలో సంఘసేవ ఒక వృత్తి విద్య అవుతున్నది. ఇట్లా అవడం అందరూ మెచ్చుకోతగిన విషయం. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, దేశంలోని 7067 సేవా సంస్థలకీ 11.72 కోట్ల రూపాయలు యింతవరకూ ధనరూపంలో సహాయంచేసింది. సేవాసంస్థలలో కొన్నిచోట్ల స్వచ్ఛంధ సేవాభిలాషులు పనిచేస్తున్నా మొత్తంమీద సంఘసేవలో శిక్షితులైనవారు ఈ సేవా వృత్తిని స్వీకరిస్తే, మనదేశంలో సంక్షేమ కార్యక్రమాలు మరింత చురుకుగా జరిగే అవకాశంవున్నది.

సంఘసేవ వృత్తిగాకాక, ఒక కాలక్షేపంగా తీసుకునే సామాన్య గృహిణులకికూడా, ఈ సోషల్ వర్క్ స్కూలులో శిక్షణయివ్వడం, శిక్షణాకాలం అన్ని స్కూళ్లలో పరిమితం చెయ్యడం అవసరమని శ్రీమతి దేశముఖ్ అన్నారు. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ఆధ్వర్యాన 'యన్ సైక్లోపేడియా ఆఫ్ సోషల్ వర్క్ యిన్ యిండియా' ప్రచురించడానికి పరిశోధనలూ, ఏర్పాట్లు జరుగుతున్నవనికూడా చెప్పారు శ్రీమతి దేశముఖ్. ఢిల్లీ స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ మిగతా సోషల్‌వర్క్ స్కూళ్లకి మార్గదర్శకురాలౌతుందనీ, దేశంలో మిగతా స్కూళ్లుకూడా తమ స్వంత భవనాలు నిర్మించుకు సంక్షేమ కార్యక్రమలలో యితోధిక సేవ సక్రమ

# హైద్రాబాద్‌లోని మా సభ కార్యకలాపాలు

ఈ నెల. 10. వ. తేదీ శుక్రవారం నాడు, మా హైద్రాబాద్ మహిళాసభ హాస్టల్ భవనంలో వరలక్ష్మీ పూజ అత్యంత వైభవంగా జరిగింది. ఆనాటి ఉదయం విద్యార్థినులందరూ దేవిని అలంకరించి, భవనమంతా పచ్చటి తోరణాలతో, రంగురంగుల ముగ్గులతో మనోహరంగా అలంకరించారు. ఉదయం సహస్రనామ పూజ జరిగింది.

ఆనాటి సాయంకాలం దేవికి హారతి యిచ్చి పేరంటం జరిపారు. పేరంటానికి శ్రీమతి నీలం నాగరత్న సంజీవరెడ్డి, శ్రీమతి రాఘవమ్మా బ్రహ్మానందరెడ్డి, డాక్టర్ శకుంతలాదేవి, మొదలగు సోదరీమణులు విచ్చేసి, పసుపుకుంకుమ స్వీకరించారు. సభ విద్యార్థినులు చక్కటి మంగళ గీతాలు పాడి అతిధులను ఆనందపరిచారు.

ఆగస్టు 15. వ. తేదీ, భారత స్వాతంత్ర్య దినోత్సవ సందర్భాన ఆంధ్రమహిళాసభ ఆవరణలో పతాకోత్సవం జరిగింది. ఆంధ్రమహిళా సభ వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ జాతీయపతాకను ఎగురవేశారు. ఆనాటి వుత్సవంలో మా సభలోని వివిధ శాఖల విద్యార్థినులూ, ఆఫీసు సిబ్బందీ, శ్రీయత దేశముఖ్, శ్రీమతి బ్రహ్మానందరెడ్డి, శ్రీమతి లక్ష్మీబాయమ్మా, ఎ. శ్యామలాదేవి. శ్రీమతి నరోత్తమరెడ్డి, శ్రీమతి యన్. కామేశ్వరి మున్నగువారు పాల్గొన్నారు.

మహాత్మాగాంధి, సర్దార్ వల్లభాయ్ పటేల్, సాంబమూర్తి, ప్రకాశంవంటి మహాయోధులు స్వాతంత్ర్య సమరం జరిపి భారత దాస్య శృంఖలాలని త్రెంచివేశారు. అనేక బాధలకి, అవమానాలకి గురిఅయి పొందిన ఈ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకునేందుకు ప్రతి వొక్కరూ నిరంతరం శ్రమించాలి. ముఖ్యంగా విద్యార్థినులపై, స్త్రీలపై ఈ బాధ్యత వున్నదని వక్కాణించారు శ్రీమతి దుర్గాబాయ్‌గారు. స్వాతంత్ర్యసముపార్జనానంతరం, దేశం యీ పదిహేనేళ్లలో అనేక రంగాల్లో ప్రగతిపొందినది. నిరక్షరాస్యత, నిరుద్యోగం, వ్యాధి, నిర్మూలన మొదలైన వాటి విషయంలో ప్రభుత్వం నిరంతరకృషి జరుపుతున్నది. ఈ మార్పులు రావడానికి ఒక్క ప్రభుత్వమేకాదు ప్రజలందరూ కూడా కృషి జరపాలని, ఈ మార్పు ఒక్కనాటితో రాదని కాలక్రమేణా ప్రభుత్వానికి ప్రజలకీమధ్యనున్న సహకారంతో రావచ్చునని అన్నారు ఆమె.

మా హైద్రాబాద్ మహిళాసభలో శిక్షణ పొందుతున్న విద్యార్థిని శ్రీమతి. యల్. లక్ష్మీకాంతమ్మ వందన సమర్పణతో, అనాటి పతాకోత్సవ సభ ముగిసింది.

---

## ఈ నెలలో ఆంధ్రమహిళాసభ కందిన విరాళాలు

1. శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మిబాయమ్మగారు. రు. 100—
2. శ్రీమతి. కె. వి. చెల్లాయమ్మా సాంబశివరావుగారు. రు. 100—

వీరికి మా కృతజ్ఞతాభి వందనములు.

ఆంధ్రమహిళాసభ

---

# స్త్రీ హితైషిణీ మండలి

## 31 వ. వార్షికోత్సవము

బాపట్ల స్త్రీ హితైషిణీ మండలి 31 వ వార్షికోత్సవము ఈ నెల 1 వ తేదీ సాయంత్రము శ్రీమతి మేడూరి నిర్మలాదేవి అధ్యక్షతన జరిగెను. అధ్యక్షులు మహిళాసమాజముల విశిష్టతను, ఆవశ్యకతనుగురించి ప్రసంగించిరి. మండలి ఆవరణలో నూతనముగా నిర్మింపబడిన, బహిరంగ స్థలవేదికను కళాతపస్వి శ్రీ సింగిరాజు నాగభూషణరావుగారు ప్రారంభించిరి. ఆరు బయట రంగస్థలముల ప్రయోజనమునుగురించి నటనా విధానమును గురించి శ్రీ నాగభూషణరావుగారు ఉపన్యసించిరి. మండలి కార్యదర్శిని శ్రీమతి మల్లాది వెంకటసుబ్బమ్మ నివేదికను చదివిరి. అధ్యక్షురాలు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మండలి చరిత్రను సంగ్రహముగా వివరించిరి. బాపట్ల ప్రశస్తి అను గేయమును, పెండ్లిచూపులు, నాటకమును శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ జీవిత చరిత్ర బుఱ్ఱ కథను, మండలిచే నిర్వహింపబడుచున్న యువతీ సంక్షిప్త విద్యార్థినులచే ప్రదర్శింపబడెను. అధ్యక్షురాలి సమీక్ష వచనములతోను కార్యదర్శిని వందన సమర్పణముతోను సభ ముగిసెను.



## తొలి వార్షికోత్సవము

బాపట్ల స్త్రీహితైషిణీ మండలివారిచే నడుపబడుచున్న యువతీ సంక్షిప్త విద్యాలయ ప్రథమ వార్షికోత్సవము ఈ నెల 2వ తేదీసాయంత్రము శ్రీమతి కొండా పార్వతీదేవిగారి అధ్యక్షతను నిర్వహింపబడెను. స్థానిక వ్యవసాయ కళాశాల అధ్యాపకులు శ్రీమతి పేరి సర్వలక్షమ్మగారు మహిళోద్యమాన్ని గురించి ఉపన్యసించి సభాప్రారంభము కావించిరి. అధ్యక్షురాలు యువతీ అభ్యున్నతికి సంక్షిప్త విద్యాలయాల ఆవశ్యకతను, ఉపయోగమును, కేంద్ర సంక్షేమ మండలి కృషిని గురించి ఉపన్యసించిరి. సంక్షిప్త విద్యార్థినులకు మేనేజిమెంటు వారిచే యివ్వబడిన చీరెలు, రవికెలు అధ్యక్షురాలు పంచిపెట్టిరి, శ్రీరాయప్రోలు భద్రాద్రి రామశాస్త్రిగారు తాము రచించిన ప్రశస్తి పద్యములను చదివిరి. శ్రీమతి కనుపర్తి వరలక్షమ్మగారు, సంక్షిప్త విద్యాలయముల వల్ల జరుగుచున్న శ్రేష్ఠతను వివరించిరి. వ్యవసాయ కళాశాల విద్యార్థిని టి. కృష్ణకుమారి లలితసంగీతము గానముచేసిరి. విద్యార్థినులు విచిత్ర వేషధారణ, గ్రామసేవిక నాటకము, మహిళాప్రబోధము బుఱ్ఱకథ, ప్రదర్శనలు జరిపిరి. కార్యదర్శిని శ్రీమతి మల్లాది వెంకటసుబ్బమ్మగారు మండలిచే నిర్వహింపబడుచున్న యువతీసంక్షిప్త విద్యాలయ నివేదికను చదివిరి. ఆటలలో పాల్గొనిన విద్యార్థినులకు బహుమతులు పంచిపెట్టిరి. కార్యదర్శిని వందన సమర్పణముతో ఆనాటి సభ ముగిసెను.

---

# వినతి

ఆంధ్రమహిళ పత్రికలో ప్రచురణార్థం, కథలూ, వ్యాసాలు, నవలలు, ఏకాంకికలూ మొదలైనవి కావలెను. వ్యాసాలు సాధ్యమైనంత వరకూ స్త్రీ సమస్యలకూ స్త్రీ జీవితానికీ సంబంధించినవై వుండాలి. ఆంధ్రమహిళ స్త్రీ రచనలకు ప్రత్యేక ప్రాధాన్యమిస్తుంది. ఈనాడు ఆంధ్ర దేశంలో అసంఖ్యాక స్త్రీ రచయితలు వున్నారు. వారు ఆంధ్రమహిళకు తమ అమూల్య రచనలు పంపి మా పత్రిక విజయానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాము. ప్రచురించిన వాటికి యథోచిత పారితోషికమీయబడును. రచనలు ఈ దిగువ ఎడ్రసుకి పంపప్రార్థన.

**ఎడిటర్ : ఆంధ్ర మహిళ**

7-ఎ. రోజిరి చర్చిరోడ్, శాన్‌థోమ్, మద్రాసు-4

# మా కార్యకలాపాలు

ఆగస్టు నెలంతా మా మహిళాసభ ప్రాంగణం వుత్సవాలతో కలకలలాడుతూ వుంటుంది. శ్రావణమాసం అనగానే వరలక్ష్మీవ్రతం, ఆపైన భారత స్వాతంత్ర్య దినోత్సవం, ఆతరువాత వినాయకచవితీ, దసరా యిలా ఆగస్టు నెలతో మా సభా ప్రాంగణంలో పండగ హడావిడి వెల్లి విరుస్తూంటుంది.

ఈ సంవత్సరం జూలై నెలలోనే మాకు కొత్త ప్రోగ్రాములు మొదలయినాయి. జూలై ముప్పయ్యవ తేదీన ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్‌లోని సిలవర్ జూబ్లీహాలులో తొలిసారి చిన్న మీటింగ్‌తో పాటు, ఫిలిమ్ ప్రదర్శన జరిగింది. రాష్ట్రపతి రాధాకృష్ణన్ సిలవర్ జూబ్లీ సందర్భంలో ఈ హాలుని ప్రారంభోత్సవం చేశారు. ఆ రజతోత్సవాల తరువాత— జూలై ముప్పయిన తొలిసారి ఫిలిమ్ ప్రదర్శన జరిగింది. మరొక విశేష మేమిటంటే ఆనాటి ఫిలిమ్ ప్రదర్శనని పరిచయంచేసిన మిసెస్‌సైమన్స్ యొక్క వివాహ వార్షికోత్సవదినం కూడా ఆరోజునే. ఈమె మద్రాసులోని, అమెరికన్ కాన్సల్ సైమన్స్ సతీమణి.

అమెరికా సమాచార కార్యాలయంవారు ఆనాడు రెండుచిన్న చలన చిత్రాలని చూపారు. లోగడ అమెరికా అధ్యక్షుని సతీమణి జాక్విలన్ కెనడీ భారతదేశానికి అతిథిగా వచ్చి మన దేశంలో కొన్నాళ్ళున్నారు. ఆ పర్యటన సందర్భంలో ఆమె భారతావనిలో తిలకించిన వివిధ ప్రాంతాలని, భారతీయులు ఆమెకిచ్చిన స్వాగతాభిమానాలని యీ చలనచిత్రంలో చక్కగా చిత్రించారు. రెండోది 'ఫాలోదిసన్' సూర్యుని వెంట. భారతావనికి మల్లేనే సువిశాలమైన అమెరికా ఖండాన్ని ఈమూల నుంచి, ఆమూల వరకూ పయనించి విదేశయాత్రీకునికి కనబడే దృశ్యాలు అతి చక్కగా చిత్రించారు. అన్ని రంగాలలోని వ్యక్తులు, అన్ని ప్రాంతాలవారు తమతమదైనందిన కృత్యాలలో ఎలా మునిగిపోయేది అతిసహజంగా చూపారు.

ఈ చిత్రప్రదర్శనకి ముందు ఫారెన్‌టూరిస్ట్ హాస్టల్ నిర్వాహకురాలు వై. వి. వెంకటేశ్వరమ్మగారు మిసెస్ సైమన్స్‌ని — సభాసదులకి పరిచయం చేశారు. సిల్వర్ జూబ్లిహాలులోచిన్న గ్రంథాలయమూ, అక్కడ విద్యార్థినులకి ఆహ్లాదాన్ని కలిగించేందుకు రేడియో మొదలగునవి ఏర్పాటుచేయనున్నారు. ఆనాడుమిసెస్‌సైమన్స్ రేడియో స్విచ్ ఆన్‌చేశారు. ఈ రేడియో ముందు ముందు నర్సింగ్‌హోమ్‌లోని రోగులకి కూడా వినిపించే ఏర్పాట్లు జరుగు తున్నాయి. గ్రంథాలయానికి పుస్తకాలని కూడా సేకరిస్తున్నారు. ఈ గ్రంథాలయంలోని గ్రంథాలు అక్కడ వున్న నర్సులకీ, కుటుంబ నియంత్రణ శిక్షణలో తర్ఫీదు పొందుతున్న విద్యార్థినులకీ, సంక్షిప్తనర్సు ట్రయినింగ్ పొందుతున్నవారికీ అక్కడనున్న ఆఫీసు పనివారికేకాక, నర్సింగ్ హోమ్ రోగులకికూడా, వుపయోగపడేటట్లు విస్తృతం చేయాలనిమాకోర్కె. తెలుగు, తమిళ కన్నడ, మళయాళ, హిందీ, ఇంగ్లీషు ఈ ఆరు భాషలలోని పుస్తకాలూ, పత్రికలూ సహృదయులు వుచితంగా పంపినఎడల సంతోషంతో స్వీకరిస్తాము. కొత్తపుస్తకాలే అనికాదు — పాతవయినా చదవడానికి వీలయి, పేజీలు పూర్తిగా వున్నవి పంపవచ్చు. మరీ శిథిలావస్థకాని పక్షంలో, మా బయిండింగ్ సెక్షనులో వాటిని బయిండ్ చేయించి, లైబ్రరీలో భద్రపరుస్తాము. పుస్తకాలని ఆంధ్ర మహిళాసభ, నర్సింగ్‌హోమ్ అడయార్, మద్రాసు, అన్నవిలాసానికి పంపితే, మాకు సమంగా చేరుతాయి.

శ్రావణ శుక్రవారం మా విద్యాలయం ప్రాంగణంలో వరలక్ష్మీ వ్రతం పూజ జరిగింది. సహస్రనామార్చనతో అమ్మవారికి పూజా హారతులు సమర్పించారు. ఆనాడు ఆంధ్ర మహిళాసభ విద్యార్థినులూ, మహిళాసభ సభ్యురాండ్రూ పలువురు విచ్చేసి వరలక్ష్మీ వ్రతాన్ని తిలకించారు.

ఆగస్టు 15 వ తేదీన పదహారవ భారతస్వాతంత్ర్యదినోత్సవం విద్యాలయ ప్రాంగణంలో జరిగినది. ఆనాటి వుత్సవంలో డాక్టర్ స్వామి స్వాతంత్ర్య పతాకాన్ని ఎగురవేశారు. మహిళా సభ కార్యదర్శిని శ్రీమతి బి. తిమ్మాంబాయ్ గారు, డాక్టర్ స్వామిగారిని సభికురాండ్రకు పరిచయం చేశారు. సుప్రసిద్ధ వైద్యులు, గాంధీ భక్తులు, కాంగ్రెస్‌వాది, మాజీ డిప్యూటీ మేయర్ స్వామిగారు నిరాడంబరులు, దృఢసంకల్పులు. ఆ మధ్య మద్రాసులో జరిగిన ద్రవిడ మున్నేట్రక జగమ్ అల్లర్ల సందర్భాన- కొందరు దుండగీళ్లు, శ్రీస్వామిగారి యింటిపై ఎగురుతున్న జాతీయ పతాకాన్ని దించివేయమని అల్లరిచేసి, స్వామి కుటుంబంమీద బలప్రయోగం చేశారు. ఆ సందర్భంలో శ్రీస్వామికి, వారి పిల్లలకి దెబ్బలు కూడా తగిలినాయి. దెబ్బలు తగిలినా సరే లక్ష్యపెట్టక వారూ, వారి పిల్లలూ భారత జాతీయ పతాక గౌరవాన్ని కాపాడారు. అటువంటి దేశభక్తులు, స్వాతంత్ర్య పతాకాన్ని ఎగరవేయడం మా సభ్యురాండ్రకెంతో ముదావహమయింది. ఆంధ్రమహిళాసభ తరపున ఆంగ్లంలో ప్రచురితమవుతున్న 'మహిళ' బులెటన్‌ని కూడా శ్రీస్వామిగారు ఆవిష్కరించారు.

విద్యార్థినుల వందేమాతర గీతానంతరం డాక్టర్ స్వామిగారు భారతపతాకను ఎగురవేసి, భారత స్వాతంత్ర్య సమరాన్ని, ఆంధ్రమహిళా సభ కార్యకలాపాలని, ఒకసారి సింహావలోకనం చేశారు. సహాయ కార్యదర్శిని హైమవతిగారు వందన సమర్పణ చెప్పారు. విద్యార్థినుల జనగణ మన గీతంతో ఆనాటి స్వాతంత్ర్యోత్సవ సభ ముగిసింది.

యదార్థ జీవితంకంటే, కదిలే బొమ్మలు, తెరమీద కదిలే బొమ్మలు మనసుకి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఆ కదిలేది మనమే అయితే, ఆ తెరమీద కదిలే బొమ్మలు ప్రేక్షకులే అయితే, అప్పటి అనుభూతి మాటలలో చెప్పలేము. అది ఎవరికి వారు అనుభవించాలేగాని మాటలు దొరకవు. ఇటువంటి విచిత్రానుభవమే ఈనెల పదిహేడవ తేదీన- మా సభలోని ప్రతిఒక్కరికీ కలిగింది. నర్సులు, రోగులు, వికాలాంగులయిన బాలబాలికలు, కంపోజిటర్స్, బైండింగ్ పనివారు, నేత పనివారు, కుట్లు నేర్చుకునేవారు, సభలోని విద్యార్థినులు, టీచర్లు, డాక్టర్లు, వివిధశాఖల కార్యదర్శినులు, పనివాళ్లు, జవానులు, ఆఫీసు సిబ్బంది- సభా ప్రాంగణంలోని చేతనా చేతనములు- ఆఖరికి సభ ఆవరణంలోని పూవులు కూడా- కదిలి ప్రేక్షకులని కదిలించి గిలిగింత పెట్టాయి.

శ్రీమతి దుర్గాబాయ్‌గారు తమతో పాటు కొంత ప్రత్యేకతని, సౌరభాన్ని తీసుకొస్తారు. మొన్న పదిహేడవతేదీ ఆమె రాక సందర్భాన- అడయార్‌లోని సిల్వర్ జుబ్లీ హాలులో- రజతోత్సవాల చలన చిత్రమూ, ఆంధ్రమహిళాసభ అనుబంధశాఖలైన, విద్యాలయ, నర్సింగ్ హోమ్, ఆర్థోపెడిక్ సెంటర్, వనితా శిశువిహార్, ఎలిమెంటరీ స్కూలు, ఇండస్ట్రియల్ సెంటర్- యిలా అన్ని శాఖలతో కూడిన చిత్రమూ, రెండు వేసి చూపారు.

రజతోత్సవ చలన చిత్రం చూస్తుంటే, మళ్లీ ఆ వుత్సవాలలో తిరిగి పాల్గొన్నట్లయింది ప్రతి ఒక్కరికి. ఆ మూడురోజుల మహోత్సవాలని- జాగ్రత్తగా పదిల పరిచారు పంచరంగుల్లో. మరో పాతికేళ్లు పోయాక, ఈ నాటి మేమంతా

వృద్ధులమయ్యాక, ఆ చిత్రం తిరిగివేసుకుని- మళ్లీ గతంలోకి వెళ్లి ఆనందించగలుగుతాం. ఇటువంటి చిత్రాలు దశాబ్దాల పాటు పదిలపరచవలసిన బంగారు స్మృతులు.

రెండవ చిత్రం ఆంధ్రమహిళాసభ వివిధ శాఖలలోని కార్యకలాపాలని, ఆయా శాఖలలోని విద్యార్థినులనీ, ఆఫీసు సిబ్బందినీ, కార్యదర్శినులనీ పరిచయం చేస్తుంది. మహిళాసభ వివిధశాఖల భవనాలు, అచ్చటి పూలమొక్కలు- అన్నిటికీమించి, 'నీవు- నీ పక్కన కూర్చున్నవారు, నీ తోటివారు తెరమీద కెక్కడం' ఎవరికి వారిని వుత్సాహపరుస్తుంది. అందుకనే ఈ సినిమా చూస్తున్నంతసేపూ ప్రతి శాఖవారు- తమ శాఖ వ్యక్తులు తెరపై కనపడగానే కరతాళధ్వనులు, చేస్తూండేవారు. ప్రేక్షకుల కరతాళధ్వనులు, వారి వుత్సాహపూరితమయిన నవ్వులు, యీ చలన చిత్రం యొక్క ప్రాముఖ్యతని చెప్పకనే చెప్పాయి.

ముఖ్యంగా ఆంధ్ర మహిళాసభకి మూలవిరాట్టు, వృద్ధురాలూ అమ్మమ్మగారు విద్యార్థినులనిచుట్టూ కూచోపెట్టుకొని పాఠం చెప్పడం, ఆర్థోపీడిక్ సెంటర్‌లోని వికలాంగులయిన బాలబాలికలు తమ అంగవైకల్యాన్ని జయించేందుకు చేసే ప్రయత్నం, సభా ప్రాంగణంలోని, పార్కులోని రకరకాల పూలబాలలు, యీ పసి బాలలతోకలిసి తలలూపి ప్రేక్షకులని మురిపించాయి. పూలబాలలు, ఆర్థోపీడిక్ సెంటర్ వైద్యం పొందుతున్న పసిబాలలు ఈయిద్దరూ అమితంగా ప్రేక్షకులని ఆకర్షించారు. ప్రేక్షకులలో ప్రతి ఒక్కరూ తెరమీద కనపడటం, తనని తాను తెరమీద చూసుకోవడం అన్నవి మరపురాని మధురానుభవం.

స్వదేశంనుంచీ, విదేశాలనుంచీ, స్వరాష్ట్రంనుంచి, పై రాష్ట్రాలనుంచీ అనేకులు మా సభ కార్యకలాపాలని తిలకించేందుకు వస్తుంటారు. సహృదయులైన వీరిలో కొందరు చిరపరిచితులూ, మరికొందరూ కొత్తవారు — ఇలా వుంటూంటారు. ఈ నెలలో మా సభ కార్యకలాపాలని తిలకించడానికి వచ్చిన శ్రీ రాఘవేంద్రరావుగారు మా సంస్థ శ్రేయోభిలాషులలో ముఖ్యులు. వీరు ఢిల్లీలోని మా కార్యకలాపాలకి చాల సహాయం చేశారు. సహృదయులు, స్నేహశీలి, సంస్కరణ ప్రియులూ, మాసంస్థ చిరకాలమిత్రులూ అయిన శ్రీ రాఘవేంద్రరావుగారు ఆగస్టు మూడవ తేదీ మా సభకి వచ్చారు. వీరు సభలోని వివిధశాఖలని అతి శ్రద్ధగా గమనించి ఆయాశాఖల కార్యదర్శినులతో, ఆఫీసుసిబ్బందితో యిష్టాగోష్టి జరిపారు.

## కీ. శే. శ్రీమతి ఆదిలక్ష్మి

లెనిన్‌గ్రాడ్ యూనివర్సిటీలో తెలుగు, తమిళ, భాషల బోధనాధ్యాపకురాలుగా వున్న శ్రీమతి ఆదిలక్ష్మి అంజనేయులుగారు జూలై ముప్పవ తేదీన లెనిన్‌గ్రాడ్‌లో మరణించారు.

చిన్న వయస్సులోనే, అందులోనూ పాశ్చాత్య దేశాలలో అధ్యాపకపదవి అలంకరించిన తొలి ఆంధ్ర వనిత ఈమె. శ్రీమతి ఆదిలక్ష్మి మద్రాసు విశ్వవిద్యాలయపు యమ్. ఎ. పరీక్షలో ప్రప్రథమురాలుగా వుత్తీర్ణులయారు. ఈమె తెలుగు, తమిళ భాషల్లోనే కాక బెంగాలీ, హిందీ, సంస్కృతం, రష్యన్ భాషల్లో కూడా కృషి చేశారు.

1957 శైవసాహిత్యంతో ఈమె చేసిన పరిశోధనలకి యమ్. లిట్ డిగ్రీయిచ్చారు. 1958 లో భారత ప్రభుత్వపు ఆధ్వర్యాన లెనిన్‌గ్రాడ్ విశ్వ విద్యాలయంలో ప్రాచ్య భాషలు నేర్పే అధ్యాపకురాలుగా నియమింపబడి రష్యాలో అనేకుల మన్ననలపొందారు.

ఆలిండియా రేడియో ప్రోగ్రామ్ జర్నల్ వాణి ఎడిటర్ అయిన శ్రీ అంజనేయలుగారి సతీమణి. ముప్ఫయిమూడేళ్ళ పిన్న వయస్సులో శ్రీమతి ఆదిలక్ష్మి, భర్తనీ, తన పసిపాపనీ, వృద్ధురాలైన తల్లినీ, అక్కచెల్లెళ్ళనీ, అసంఖ్యాకులైన స్నేహితులనీ వొదిలి వెళ్ళిపోయారు. ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక !

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు!



# మహిళా విద్యా సంఘము

## శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

స్వతంత్రభారతములో పంచవర్ష ప్రణాళికా రచన ప్రారంభమైన నాటినుండీ స్త్రీ విద్యాభివృద్ధి కావటానికి ప్రభుత్వము ఆలోచిస్తునే ఉన్నది. అందుకు తగిన సహకార సంపత్తిని గలిగించటానికి సిద్ధముగానే ఉన్నది. చేతనయిన ప్రయత్నాలు చేస్తునే ఉన్నది. కాని రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తిఅయిన తరువాత కూడా విద్యాభ్యాసము చేస్తున్న బాల బాలికల సంఖ్యలో అసమానత్వము స్పష్టంగా కొట్ట వచ్చినట్లుగా కనబడుతునే ఉన్నది. ఈ అసమానత్వము గ్రామాలలోనూ పట్టణాలలోనూ ఒక మాదిరిగా లేదు. అలాగే అగ్ర జాతులలోనూ దళితజాతులలోనూ కూడా ఒక మాదిరిగా లేదు.

దీనివల్ల పూర్తిఅయిన ఈ రెండు పంచవర్ష ప్రణాళికలలోనూ చెప్పినంత శ్రద్ధ ప్రాథమిక విద్యపట్ల ప్రభుత్వము తీసుకొనలేదనే అందరూ భావించారు. 1961–66 అనగా మూడవ పంచవర్షప్రణాళికా కాలములో 6 నుండి 11 సంవత్సరాల పిల్లలకు ఉచితముగా ప్రాథమిక విద్యగరపటానికి ప్రభుత్వము సిద్ధపడ్డది. కాని చాలా ప్రాంతాలలో 1960–61 లలో గమనింపబడిన అంశమేమనగా 80.5 శాతము బాలురు పాఠశాలలకు వెళ్లి విద్యాభ్యాసము చేస్తూ ఉండగా 40.4 శాతము బాలికలు మాత్రమే పాఠశాలలకు వెళ్లుతున్నారని. ఈ సంఖ్యను పరిశీలించిన సంఘము రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, బిహార్, జమ్మూ, కాశ్మీరము ఈ ఆరు రాష్ట్రాలలోను 50 శాతము బాలికలు పాఠశాలలకు వెళ్లేటందుకూ, 90 శాతము బాలికలు మిగతా రాష్ట్రాలలోనూ విద్యార్జన చేయటానికి ప్రయత్నాలు చేయవలెనని పరిమితి పెట్టుకున్నది.

11 సంవత్సరాలనుండి 14 సంవత్సరాలలోపు విద్యార్జన చేసే బాలికలు 1960–61లో 10.8 శాతము మాత్రమే. కాని బాలురు 34.3 శాతము ఉన్నారు. ఈ కారణముచేత వెనుకబడిన ఆరు రాష్ట్రాలలో అనగా రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, బిహార్, జమ్మూ, కాశ్మీరములలో 12.5 శాతము బాలికలు పాఠశాలలకు వెళ్లే ప్రయత్నాలు చేయవలెనని సంఘము యొక్క సంకల్పము.

ఉన్నత పాఠశాలలో 14–17 మధ్య వయసుగల బాలికలు 1960–61 సంవత్సరాలలో 18.4 శాతము మాత్రమే చదువుతున్నారు. అదే వయస్సులో పాఠశాలలకు వెళ్లి విద్యార్జన చేసే మగపిల్లల సంఖ్య 18.4 శాతము ఉన్నది. కనుక వెనుకబడిన రాష్ట్రాలలో కనీసము నూటికి ఆయిదుగురు బాలికలయిన పాఠశాలలకు వెళ్లేటట్లుగాతగినప్రయత్నాలు చెయ్యావలెనని సంఘము నిశ్చయించింది. మిగతా రాష్ట్రాలలో 10 శాతము వరకూ ప్రయత్నించవలసి ఉంటుంది. దీనిలో కేరళ ఢిల్లీరాష్ట్రాలు అభివృద్ధికరముగా ఉన్నవి కనుక చేర్చలేదు.

కళాశాల స్థాయిలో సంఖ్యను ప్రత్యేకముగా నిర్ణయించలేదు. కాని సాధ్యమైనంతవరకూ సంఖ్యను అభివృద్ధి చేయవలెనని సంఘము నిర్ణయించింది.

జాతీయ విద్యాసంఘము పరిశీలించగా రెండవ పంచవర్షప్రణాళికలో ప్రాథమిక పాఠశాలలలో చేరిన బాలికలసంఖ్య 500,000 అని తేలింది. మాధ్యమిక పాఠశాలలలో 100,000మంది బాలికలూ 33,000 మంది బాలికలు ఉన్నత పాఠశాలలలోనూ చేరినట్లు లెక్కలను బట్టి తెలిసింది.

ప్రాథమిక దశలో బాలికల సంఖ్యను మూడింతలు కన్న అధికము చేయవలెననీ, మాధ్యమిక ఉన్నత పాఠశాలల దశలో రెండింతలు చేయవలెననీ సంఘము పరిమితి పెట్టుకున్నది. కాని ఈ పరిమితులను సామాన్యమైన అభివృద్ధికరమైన మార్గాలద్వారా సాధించటము దుర్లభము. కనుక పంచవర్షప్రణాళికలద్వారా మామూలుగా సాధించే కార్యక్రమాలలో పాటు సంఘము నిర్ణయించుకున్న లక్ష్యాలను సాధించటానికి ప్రత్యేక కార్యక్రమాలు రూపొందించటము ముఖ్యమని సంఘము గుర్తించింది. వీటివల్ల ఏ అసాధారణ పరిస్థితులవల్ల మగపిల్లలతోపాటు ఆడపిల్లలు కూడా అధికసంఖ్యలో విద్యాభ్యాసము చేయలేక పోతున్నారో వాటిని సంస్కరించి చక్కబెట్టటానికి వీలుకలుగుతుంది.

ఈ ప్రత్యేక కార్యక్రమాల ఆశయము బాలికలను అధికసంఖ్యలో పాఠశాలలకు పంపటానికి తగిన ప్రోత్సాహాన్ని తల్లిదండ్రులకు ఇవ్వటము మొదటిది.

జాతీయ మహిళా విద్యాసంఘము రాష్ట్ర స్థాయిలో కూడా నెలకొల్పినట్లయితే ఏ రాష్ట్రాభివృద్ధిని ఆ సంఘము తన స్థాయిలో పర్యవేక్షించగలదనీ- కార్యక్రమాలను రూపొందించగలదనీ భావించింది. దాని పర్యవసానముగా ఆంధ్రరాష్ట్రములో కూడా రాష్ట్ర మహిళా విద్యాసంఘము శ్రీమతి అమ్మన్నరాజాగారి అధ్వర్యముక్రింద పదముగ్గురు సభ్యురాండ్రుతో నియమింపబడినది. ఈ సంఘము జాతీయ మహిళా విద్యాసంఘాధ్యక్షురాలయిన శ్రీమతిరక్షాశరణ్ అధ్యక్షతన తన మొదటి సమావేశాన్ని నవంబరు పదకొండవతేదీ ఉదయము (1961) జరుపుకున్నది. విద్యాశాఖా డైరక్టరు, విద్యాశాఖ కార్యదర్శి కూడా ఆ సమావేశానికి ఆహ్వానింపబడినారు.

ఈ సంఘ సభ్యురాండ్రులో విద్యాశాఖలో పనిచేస్తున్న అధికారిణులు, కళాశాల ప్రిన్సిపల్సు, సంఘసంక్షేమ సంఘసభ్యులు, శాసన సభ్యురాండ్రూ ఉన్నారు.

ఈ సంఘప్రథమ సమావేశములో స్త్రీవిద్యాభివృద్ధికి అవరోధముగా ఉన్న ఆచారవ్యవహారాలను గురించీ తమ అనుభవాలనుగురించీ అధికారిణులతో సహా మిగతాసభ్యురాండ్రు చర్చించారు. మనరాష్ట్రములో జనాభాలెక్కలనుబట్టి నూటికి 34 మంది పురుషులు అక్షరాస్యులయితే 13 మందిమాత్రమే స్త్రీలలోఅక్షరాస్యులు ఉన్నారని తేలింది. దీనినిబట్టి స్వాతంత్ర్య సంపాదన తరువాతకూడా ఆడపిల్లలు విద్యలోముందడుగు వేసినట్టు అంతగా కనబడటము లేదు. కనుక దానికి తీవ్రముగా కృషిచేయాలి.

స్త్రీవిద్యకు అవరోధంగాఉన్న ఆచారవ్యవహారాలు పట్టణాలలోనూ పల్లెలలోనూ కూడా పాటించబడుతునే ఉన్నాయి. పల్లెలలో మరికొంత అధికముగా పట్టుదలలు కనబడుతాయి. అనుకూలమయిన వాతావరణము తల్లిదండ్రులలలో కలిగేటట్లుగా గ్రామగ్రామమూ పర్యటించి సభలద్వారా ఉపన్యాసాలద్వారా చేయవలసినవారు సభ్యురాండ్రు.

తలిదండ్రులుమగపిల్లలతోపాటు ఆడపిల్లలకుకూడా విద్య నేర్పించలేని స్థితిలోఉన్న పక్షములో ప్రాథమిక దశలో ఆర్థిక సమస్యేలేదు. ప్రాథమికదశలో ఉచిత విద్యను ప్రభుత్వము ప్రవేశపెట్టినది. ఇది 62 జూను నుండి అమలులోకి రాగలదు. మధ్యాహ్న భోజనాలు పాఠశాలలలోనే బిడ్డలకు అందచేయవలెననే ప్రయత్నాలుకూడా జరుగుతాయి.

ప్రాథమిక పాఠశాలలో సాధ్యమైనంతవరకూ ఉపాధ్యాయినులనే నియమించటానికి సంఘము ప్రభుత్వానికి సలహాయిచ్చింది. ఇంటింటికీవెళ్లి పిల్లలను వెంటబెట్టుకుని పాఠశాలలకు నిరపాయకరముగా తీసుకుని రావటానికి దాయీలనుకూడా నియమించాలని నిశ్చయించింది సంఘము.

గ్రామాలలో పనిచేయటానికీ, ఉద్యోగాలు చేయటానికీ స్త్రీలు సమ్మతించటములేదనీ— బలవంతముగా ప్రభుత్వముచేసిన బదిలీలకు సెలవుపెట్టుతున్నారనీ, సిఫారసులుతెచ్చి బదిలీలను త్రిప్పించుకుంటున్నారనీ విద్యామంత్రిగారు తమఅనుభవాలను విశదీకరించారు. సాధారణముగా స్త్రీలు ఒంటరిగా గ్రామాలల్లో ఉండలేకపోతారు. అందుకోరకు పాఠశాలలకు సమీపముగా ఉపాధ్యాయినులు నివసించటానికి అనువుగా 2 ఇళ్లు నిర్మించినట్లయితే ఒకరికి ఒకరు తోడుగా ఉండగలరు. ఈసలహాను సంఘము ప్రభుత్వానికి అందచేసింది. ఇది గాక పల్లెలలో పనిచేయటానికి అంగీకరించిన ఉపాధ్యాయినులకు ప్రత్యేక అలవెన్సు ఇవ్వవలెనని కూడా తీర్మానించింది.

పల్లెలలో ప్రాథమిక పాఠశాలలు విధిగాఉంటాయి. మాధ్యమిక పాఠశాలలు ఉండేచోటికి బిడ్డలనుపంపటానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించాలి. ఆడపిల్లలకు అన్నివిధాలుగా రక్షణకల్పించగల హాస్టల్సు నిర్మింపబడాలి. ఈహాస్టల్సుకు అనుభవజ్ఞురాండ్రూ సమర్థురాండ్రూ అయిన స్త్రీలు వార్డెనులుగా నియమింపబడాలి. ఈ విద్యార్థినులు తాముచెల్లించవలసిన రుసుము ధనరూపేణగానీ వస్తుధాన్యరూపేణగానీ ఇవ్వవచ్చు.

సాధారణముగా తలిదండ్రులు ఆడపిల్లలకు కట్నాలు యిచ్చి వివాహాలు చేయాలి కనుక వారికి డబ్బుఖర్చుచేసి చదువు చెప్పించటానికి అంత సుముఖులుగా ఉండరు. దానికికారణము వారి ఆర్థిక పరిస్థితి అంత మెరుగుగా ఉండకపోవడమే. ఇటువంటి పరిస్థితులను చక్కపరచటానికి విద్యార్థినులకు ఉపకారవేతనాలు మెరిట్ పిప్పులు మొదలయినవి ఇచ్చి ప్రభుత్వము తలిదండ్రులనూ విద్యార్థినులనూ ప్రోత్సాహపరచాలి. విద్యార్థినులు పాఠశాలలకు వెళ్లే

టప్పుడు ప్రత్యేకముగా ధరించేఉడుపులనుకూడా ప్రభుత్వమే ఇవ్వాలి. విద్యార్థినులు పాఠశాలలకు వెళ్లటానికి బస్సులలో సగము రేటుపైన టికట్లు లభించే ఏర్పాటుకూడా ప్రభుత్వము చేయాలి.

సాధారణముగా మాధ్యమిక పాఠశాలలు ఉన్నత పాఠశాలలు ప్రత్యేకముగా ఆడపిల్లలకుఉంటే ఎంతో సౌకర్యముగా ఉంటుంది. చాలామంది తలిదండ్రులు సహవిద్యావిధానాన్ని అంగీకరించరు. తలిదండ్రులను ఆడపిల్లలకు చదువుచెప్పించమని ప్రోత్సహించాలంటే తగినవాతావరణము కల్పించదలచిన ప్రభుత్వము బాలికలకు విడిగా పాఠశాలలను సాధ్యమైనంతవరకూ నెలకొల్పటానికి ప్రయత్నించాలి. వీలుకానిపక్షములో ఉపాధ్యాయినులను ఆ పాఠశాలలలో నియమించి ఆడపిల్లలబాధ్యత అంతా వారికి ఒప్పగించాలి. ఈ మిశ్రమపాఠశాలలలో విద్యాభ్యాసముచేసే బాలికలకు ప్రత్యేకముగా ఫిజికల్ ట్రైనింగుక్లాసులు ఉపాధ్యాయినులేనడపాలి. ఈబాలికలకు పాఠశాలలలో స్నానాలగదులూ పాయఖానాలు విశ్రాంతిగదులూ ప్రత్యేకంగా ఉండాలి. నౌకర్లుకూడా స్త్రీలేఅయి ఉండాలి.

స్త్రీవిద్యనుగురించి ప్రత్యేకశ్రద్ధను తీసుకుని స్త్రీలలో విద్యావ్యాప్తిచేయవలెనని ప్రపంచమంతా ముక్తకంఠములతో చాటుటమెందుకు? స్త్రీఇంటికే కాదు- సంఘానికేకాదు- దేశానికే కాదు- జగత్తుకంతా వెలుగునిచ్చేజ్యోతి. ఒక్కస్త్రీని విద్యావతిని చేస్తే లోకమంతా మరమ్మతుకాగలదు. అటువందిటి కోటానుకోట్లగాఉన్న నారీలోకమంతా విద్యావతులైతేజగత్తుకు ఎంతవెలుగు? ఎన్నిజ్యోతులు!

---

## శ్రీయుత సర్వేపల్లి రాధాకృష్ణ రాష్ట్రపతిగారికి

### శ్రీమతి గుడపూడి ఇందుమతీదేవి

గీ॥ సర్వభాషావిదుడుసర్వ ! శాస్త్రభావ
కోవిదుడు సత్కవీంద్రుండు ! గుణమణినిధి
ధర్మమూర్తియు వేదాంత తత్వరసికు
డార్యహితశీలి మాతృదేశాభిమాని

కం॥ రాధాకృష్ణార్యవరున్
సాధితఘనరాజకీయ సర్వద్బుధా
రాధనమతిని జగన్నుత
మేధానిధి రాష్ట్రపతినమేయకృపాఢ్యున్ !

గీ॥ అనఘ ఇక్ష్వాకుకాకుత్థ్స నంబరీష
సాధుమాంధాతృశ్రీరామ చంద్రమూర్తి
రాష్ట్రపతియౌచుఘనయశో రాజివెలుగు
శాంతమూర్తి రాజేంద్రప్రసాదులవలె
చిరతరాయురారోగ్యకు శ్రీలొసంగి
రక్షసేయుశ్రీరాముడీ రాష్ట్రపతిని
సాధుహితుని రాధాకృష్ణ సత్యశీలు
లెనుకముందరనెల్లెడ వెలయనీలిచి॥

గీ॥ అతడు భారతరత్నాఖ్య నలరినాడు
అదియు సార్థకనామధేయంబెసుండు
అతడు ప్రజావళికినచ్చి నట్టిపురుషు
డతనిరక్షించు శ్రీరాము డనవరతము

# గాయపడిన మది

కుమారి బి. యస్. రాణి

విద్యుద్దీపాల కాంతిలో పెళ్ళిపందిరి కళకళలాడుతున్నది.

కల్యాణ మండపం ఆ పందిరికి వింతశోభను చేకురుస్తున్నది. ప్రిన్స్‌పాల్ గారి ఒక్కగానొక్క కూతురి వివాహం. కాలేజి విద్యార్థులు, ఉపాధ్యాయులు అంతా తరలి వచ్చారు. పెళ్ళికూతురు శశి మాత్రం హృదయా వేదనతో ఈ వైభవాన్ని కన్నులార చూడలేకపోతున్నది.

పెళ్ళి కుమారుడు రాజు విడిదిలో స్నేహితుల మధ్య ఫలహారం ఆరగిస్తు ఛెలోక్తులు విసురుతు, సరసాలు భరిస్తు, ఉల్లాసంగాఉన్నాడు, బ్యాండ్ జోరుగా మ్రోగుతున్నది. పురోహితుడు హడావిడిగా తిరుగుతున్నాడు.

పెళ్ళికూతురు శశి బాధగా శూన్యంలోకి చూస్తు కూర్చున్నది. కన్నీటి చారికలతో ఆ మొహం వాడివున్నది.

'శశి రామ్మా? వరపూజకి అవతల టైముఅవుతున్నది' అంటు, శశి తల్లి వర్ధనమ్మగారు తొందర చేస్తున్నారు. శశికి దుఃఖం ఆగటంలేదు. తల్లి వెంబడి, బందిఖానాలోకి వెళ్లే ఖైదీలాగా బయలుదేరింది. పెళ్ళి కుమారుడు రాజు, కల్యాణ మండపంలో కూర్చుని నలుమూలల పరికించి లోపమేమి లేదన్నట్లు తృప్తిగా నిట్టూర్చాడు. శశికి మండపంలో అడుగు పెట్టుంటే జైల్లో అడుగు పెడ్తున్నట్లుగా ఉన్నది.

తనదనుకున్న శశి పరాయిదయి పోతున్నందుకు, బ్రతుకే బరువనిపిస్తున్నది, అక్కడే కూర్చున్న రవికి.

"దూరదేశమేగెదవో పెళ్ళి కూతురా
కనులనీరు నింపకుమా నీవయినా సుఖపడుమా?"

అన్న ఘంటసాల రికార్డు చెవులు బ్రద్దలయేలా వినిపిస్తున్నది లౌడ్ స్పీకర్‌లోనుంచి. రవి ఒక్కనిముషం కూడ అక్కడ కూర్చోలేకపోయాడు. రవి వెళ్ళేందుకు లేవడం, [illegible] రణ జరగడం ఒక్కసారి జరిగాయి.

రవి తన రూమ్‌లో కూర్చొని గతాన్ని తలుచుకొని గుండెలు అలిసేలా విలపించాడు.

తనదనుకున్న శశి పరాయిది అయిపోయింది. తన మామయ్య కూతురు రమని చేసుకోవాలి తప్పదన్నారు నాన్న అమ్మ తనకు యిష్టంలేకపోయినా పరిస్థితులు ప్రభావం వల్ల 'మీయిష్టం అనేశాడు' తను. రమకి తనంటే ఎంత యిష్టమో! అమ్మని కూర్చోపెట్టి యింటిపని అంతా తనే చేసేది, అప్పుడే కోడలయినట్లు. కాని తన మనస్సుని రమ ఆకర్షించలేక పోయింది, తనను ఆకర్షించిందిల్లా శశి, కాలేజిలో తనకు శశితో పరిచయమయ్యాక, అమ్మ, నాన్నల అభిప్రాయాన్ని వ్యతిరేకించాల్సి వచ్చింది. రమని ససేమిరా పెళ్లి చేసుకోనన్నాడు తను, నాన్న అమ్మ ఎంతో బోధచేసారు తాము చెప్పిన మాట వినమని, మామయ్యకిచ్చిన మాట నిలబెట్టమని. తనకి ముమ్మాటికి ఈ సంబంధం యిష్టంలేదని మొఖంమీద చెప్పేశాడు. తరువాత ఆ ప్రస్తావన ఎత్తటమే మానుకున్నారు.

ఆ రోజు శశి అమాయకపు మాటలు తను ఏనాటికి మరువలేడు. ఆ రోజు శశిని ఏడ్పించాలి అని తనకు అనిపించింది. ఎందుకో విచారంగా కుర్చున్నాడు శశి వచ్చే టైముకి. "హల్లో! రవి యివాళ పిక్చరుకి వెళదామనుకున్నాము కదూ! త్వరగా వచ్చేసాను యింకా రెడీ కాలేదేం?"

"రాలేను శశి క్షమించు!"

"అదేమిటి రవి, ఇంటినుంచి ఏమయినా కబురు వచ్చిందా?"

"శశి నన్ను మర్చిపో, నేను, అసమర్ధుణ్ని, దుర్మార్గుణ్ని"

"రవి నీకు పిచ్చిగాని పట్టలేదుకదా?"

"నిజమే చెపుతున్నాను శశి. రమతో నా వివాహం నిశ్చయమయింది!"

"ఆ....రవి; నిజమా? నిన్ను నమ్మినందుకు ఎంత మోసం చేసావు. తల్లి. తండ్రులను కూడ దూరం చేసుకోటానికి సిద్ధమయానే. ఆనాటి నీ ప్రమాణాలు మర్చిపోయావా? నీ స్వభావం యింత చంచలమయింది అనుకోలేదు, రవి నాకీప్రపంచంలో బ్రతకటానికి స్థానం లేకుండా చేస్తున్నావు కదూ! నీవు దూరమయిన మరుక్షణమే పరలోకంలో ఉండి, మీ దంపతులను ఆశీర్వదిస్తాను." శశికి కన్నీరు ప్రవాహంలాగా వచ్చేస్తున్నాయి.

తను చూడలేకపోయాడు ఆ దీనవదనాన్ని. తను ఆ క్షణాన తన నిగ్రహ శక్తిని కోల్పోయాడు. "శశి! నీది యింత సున్నితమయిన మనస్సు అనుకోలేదు క్షమించు! నీ మనస్సు ఎలాంటిదో చూడాలని పరీక్ష చేశాను, ఎంత పిచ్చిదానివి శశి. నిజమని భ్రమపడ్డావు కదూ! నిన్ను మించి నాకు ఎవరు లేరని తెలియదా?" "పోనీ ఈ నాటికైనా నామనస్సు తెలుసుకున్నావు. నన్ను

అన్యాయం చెయవు కదూ!" అని దీనంగాచూచిన ఆనాటి శశిచూపులు మరువలేదు తను. ఆనాటి శశి మాటలు ఈ క్షణానికి ఇంకా చెవుల్లో ప్రతిధ్వనిస్తునే వున్నాయి. ఆ నాటి శశిఏనా! ఈ పెళ్లికూతురు శశి! కాదు! ఆ శశి అమాయకురాలు, ఈ శశి దుర్మార్గురాలు.

శశి కోసం రమని నిరాకరించటం చేత నామీద ఆశలు పెట్టుకున్న రమ ఆత్మహత్య. చేసుకున్నది, ఆనాటినుంచీ నాన్న తనని మనిషిగా చూడటం లేదు. నాన్న మాటలు విని సహించలేక ఆ యింటి గడప త్రొక్కనని శపథంచేసి వచ్చాడు, అమ్మ కన్నీళ్లు కూడ కరిగించలేదు తనని ఆ సమయంలో. శశి దగ్గరకు వచ్చాక తన బాధలన్నీ మర్చిపోయాడు. అటువంటి సమయంలో ఒకరోజు హఠాత్తుగా శశి శుభలేఖ పట్టుకొచ్చి యిచ్చింది. దానితో పాటు ఒక లేఖకూడ ఉన్నది.

రవి!

నన్ను మర్చిపో, నేను అదృష్ట హీనురాల్ని. చిన్ననాటి పెద్దల వాగ్దానాలతో రాజు బావతో వివాహం నిశ్చయించారు, నాన్నగారు. నామాటలు పెడచెవిన పెట్టారు. రవి! నిన్ను నీవాళ్ళకు కాకుండా చేసాను కదూ బ్రతికి ఉన్నంతవరకు దుఃఖిస్తుంటాను. రవి! రమని నీకు కాకుండా చేసాను అందుకు భగవంతుడు తగిన శిక్ష విధించాడు. నిన్ను నాకులేకుండా చేసాడు. రవి! నిన్ను ఏనాటికి మరువలేను నిర్భాగ్యురాలు అని గుర్తుంచుకో.—

రవీ! నీ భవిష్యత్తు పాడుచేసుకోకు, నన్ను మర్చిపో రవి! నేను చేసిన పాపానికి పైనున్న ఆ భగవంతుణ్ని నావాడవయిన నిన్నూ కనికరించమని కోరుతున్నాను.

శోకమయి, నీ శశి.

అంతే, అతని హృదయంలో అగ్నిపర్వతం బ్రద్దలయింది చివరసారిగా పెండ్లికూతురు శశిని చూచి వీడ్కోలు తీసుకుందామనుకుని ప్రయాణమయ్యాడు. పెళ్ళికూతురుగా శశిని చూడగలిగాడు. కొంత తృప్తికలిగింది. యిక మిగిలింది, రమని క్షమార్పణ కోరుకోవాలి. ఆశలు పెట్టుకున్న అమాయకురాల్ని బలిచేశాను. శశి దంపతులు సుఖంగా వర్ధిల్లాలి. అదే అంతిమకోరిక.

'రమా! ఇదిగో వస్తున్నాను, నీకుచేసిన ద్రోహానికి ఫలితం అనుభవిస్తున్నాను. నీవు చూపిన దారివెంటనే వస్తున్నాను,' అంటు సైనేడ్ మింగాడు రవి. ఆత్మ హత్య చేసుకున్న వార్త పెళ్ళిపందిట్లో తెలిసింది.

# సాహిత్యము - సాంస్కృతిక విలువలు

శ్రీమతి అద్దేపల్లి వివేకానందాదేవి

ఆంధ్రమహిళా సభ రజతోత్సవ సందర్భాన రచయిత్రుల సమ్మేళనం జరిగినది. రెండురోజులపాటు జరిగిన ఈ సమావేశంలో సుమారు యిరవై మందిదాకా సోదరీ మణులు పాల్గొన్నారు. ఆ సమ్మేళన సందర్భంలో చదివినవ్యాసాలని సంగ్రహంగా ఆంధ్రమహిళలో వరసగా ప్రచురిస్తున్నాము. పోయిన రెండు నెలలో కొందరి రచనలని మా పాఠకులకి పరిచయం చేశాము. ఈ నెలలో మరికొన్ని.

సంస్కృతికి ప్రతిబింబం సాహిత్యం; సంస్కృతి వాడనితలపూవు సాహిత్యమైతే సంస్కృతికీ సాహిత్యానికీ అవినాభావ సంబంధం ఉన్నదన్నమాట పరమ సత్యం.

వివిధదేశాల సాహిత్య చరిత్ర చూస్తుంటే, ఆయా దేశ కాల పరిస్థితులందాయాదేశాల సంస్కృతీ, నాగరికతా సముద్రాల ఆటుపోటులబట్టే, సాహిత్యాభ్యుదయపు చందురుడూ మింటవెన్నల విరిసినా, కృష్ణపక్ష చంద్రుడైనా! కావడం కద్దు.

సంస్కృతికి అర్థం—సమ్యక్ + కృతి — చక్కగా, చేయబడిన పని అనికదా అర్థం. జగజ్జీవన ప్రవాహంలో పడి కొట్టుకునే వివిధజాతులూ, అనాది సిద్ధంగా, తమ జాతీయ లక్ష్యంలో, ఆనందరసానుభూతిని వదిల పరచుకుని, ఆ అన్వేషణలో చేయు కార్యాలూ, దైనందిన వ్యవహారాలూ, కృషీ, వేయేల, వారు చేయు సమస్త వ్యవహారాల్ని వారి నాగరికతా చెప్పుతున్నాయి. సంస్కృతినీ నాగరికతనూ వేరు చేయ వలసిన అవసరం ఎంతైనావుంది. రసస్నిగ్ధాహృదయంతో మలచుకున్న సాహిత్యం అలవరచుకున్న అనురాగపు చైతన్యం, హృదయాన్ని స్పందింపజేసే అపురూప అమృతధారావాహిక మధుర గాంధర్వ సంగీతం; అలౌకికత్వాన్ని చాటే అమర చిత్రలేఖనం మొదలైనవి సంస్కృతీ సరస్వతికి పెట్టనినగలు.

సంస్కృతీ జీవనస్రవంతికి సాహిత్య మొక సెలయేరు; అంతర్గతజీవనధార. విభిన్న సంస్కృతులు. వివిధ మార్గాలలో సత్యాన్వేషణ, ఆనందరసానుభవం పరమావధిగా పెట్టుకున్నట్టుగా ప్రపంచ చరిత్ర వేలు పెట్టి చూపుతుంది.

మహోజ్వలంగా, ఉరకలు, పరుగులతో, పరవళ్ళు, తొక్కుతూపోయే జీవనసంస్కృతీ మహానదికి సాహిత్యం మొక - ఆనకట్ట. వాస్తవానికిది వారధేఅయితే! సాహిత్యానికి ప్రయోజనం లేదనే పలుకేరాదు.

లక్ష్యాన్వేషణలో, బాటతప్పడం, నూతనమార్గాల నన్వేషించడం, కొత్తనిచ్చెనలు వేయడంలో సంస్కృతీ వైకుంఠ పాళీలో దిగజారిపోవడం తరుచు సంభవిస్తుంది. సాహిత్య మిటువంటి వేళల చేయూతనిచ్చి ప్రగతి మార్గాన్ని చూపి నడిపించ వలసివుంది.

సాహిత్యానికీ, సంస్కృతికీ అవినాభావ సంబంధ మున్నదని ముందే అనుకున్నాం, సాహిత్యపు ప్రభావం, జాతీయ సంస్కృతిపైనా, ఆనాటి సంస్కృతీ వైభవపు రుచులు సాహిత్యంపైనా తప్పనిసరిగా పడతాయి.

సాహిత్యమే సంస్కృతికి వారధైతే, ఆణి ముత్యాలపంట, పసిడి పలుకుల రవ్వలకుకొదువే లేదు. వీటిని సృష్టించే స్రష్ట కవిమిత్రుడు. అనన్యగుణ శీలుడు- అకలంక విద్యావేత్తా, ఉదాత్త మనోభావ గతుడు, నిరవధిక కరుణా పారంగతుడు అయినతప్ప, ఉత్తమ సాహిత్యపు శతపత్ర సుందరి ఉద్భవిల్లదు.

పతనమైపోయే విలువలనుండి కాపాడి దిగజారి పోయే జాతిని పైకి లేవనెత్తి నడిపించవలసినబాధ్యత సాహితీపరులది. భావంపు బీదతనంతో సామాన్య సంకుచిత విషయలోలత్వపు బానిసలే వారైతే,జాతీయ సంస్కృతీ వృక్షానికి చీడపట్టినట్టే భావించాలి.

సాంస్కృతికపు విలువల్ని పరిరక్షించాల్సి బాధ్యత సాహిత్యానిదని వేరే చెప్పనక్కరలేదు. ఆయా కాల పరిస్థితులనుబట్టి విలువలు మారవచ్చు, ఆ కాలానికి కావలసినవిలువల్ని మలచియిచ్చేది కవి! కవి ఒక్కనికే హృదయాలకు పరివర్తన తేగలిగిన శక్తి ఉన్నది. అందుకే అతడు అపరస్రష్ట - రవి కాంచని చోటుల చీకట్లను పారద్రోలగలడు కవి. నైతిక విలువలు దేశ

కాలానుగుణంగా మారినా, ధర్మాలెన్నటికీ మారని సత్యాలు.

కళ, కళకోసమే నసే పలుకు చిలక పలుకులా వింటూనే వున్నాం. సృష్టిలో ప్రతిచిన్ని వస్తువుకూ ప్రయోజనం ఉన్నట్లు విజ్ఞానతత్వశాస్త్రజ్ఞులు సహితం అంగీకరిస్తున్నారు. హృదయస్పందనం వల్ల జనించి, కరుణాంతరంగ హృదయకుసుమమైన సాహిత్యానికి ప్రయోజనం తప్పకుండావుంది. వుండితీరుతుంది. ఆ ప్రయోజనం ఆ ఆ వస్తుస్పందన, కంపన శక్తి ననుసరించి మాత్రం పరిమిత మౌతుంది.

రామాయణ కాలంలో, సౌభాతృత్వం, పితృత్వాల వంటి కొన్ని విలువల అవశ్యకత అవసరమైనదో ఏమో ప్రజానురంజకుడైనా రారాజు తన స్వప్రయోజనాన్ని అనందాన్ని తుదకు హృదయాన్ని గడ్డిపరకగా పరిగణించవలసి వచ్చినది. ఆనాటి విలువలట్టివి. మన విలువలు వేరుకావచ్చును, కాలగతి వేరుకదా! కవిబ్రహ్మ వానికి అమరత్వం అపాదించాడు.

మహాభారత కాలంనాటికి, కేవలం ధర్మబద్ధమైన నిష్కలంక జీవనధారకు అవధి ఏర్పడింది. తంత్రజ్ఞత, రాజనీతి, యుద్ధవిశారదత్వం, అన్యాయాన్ని, అన్యాయంతో హతంచేయవలసిన అవశ్యకత అగుపిస్తుంది.

అవసరాలనుబట్టిఅల్లిన పురాణగాధఆనాటివిలువల్ని ప్రజలకందించడానికి వచ్చినవేగాని వేరుకావు.

కావ్యాల కాలంలో, ఎత్తిచూపి, ఇదిచేయమని శాసించేరోజులు పోవడంతో, కావ్యకన్యల సుతిమెత్తని పలుకుల అవశ్యకత ఉద్భవించింది. భక్తిరస ప్రధాన గాధలు, లెక్కలేనన్ని ఉత్పన్నమయ్యాయి.

వీరరస ప్రధానగాధలు, దేశభక్తి ప్రధానగాధలూ యిటీవల కాలంలో పచ్చాయి. విలువలు మారుతూ వస్తూవున్నాయనడాని కింకేమి ఉదాహరణలు కావాలి మనకు.

మారుతూన్నా విలువలుమాట అటుంచి, మారని విలువలు కొన్ని మానవులకున్నవి. మానవుడు మనిషి కావాలంటే, మానవుడు మానవుడుగా వుండాలంటే మారనివిలువల భద్రపరచి, మాటననుసరించితీరాలి. జీవితాన్వేషణ బహువిచిత్రమైనది. ఒక్కొక్క హృదయం ఒక్కొక్కవిధంగా స్పందిస్తుంది, దాని మార్గమేవేరు. అయినప్పటికీ, సాహితీవేత్త. చదువుల సరస్వతిగా తనమృదుమధుర వాక్చాతురీ ధురీణత వల్ల, పరివర్తన తేవాల్సివుంటుంది.

ఈనాడు తెనుగుసాహిత్యకేదారంలోని పచ్చదనం సన్నగిల్లింది. అచ్చట మందార మకరందాల్ని సృష్టించే కవిహృదయం అరుదైపోయింది. జీవిత మార్గాన్వేషణ కావశ్యమైన, విలువల్ని విజ్ఞానాన్నీ, చేయూతగా అందీయలేక పోతున్నాము సామాన్యుడికి. సాహితీకర్త తానెక్కడున్నాడో! తన విలువలేమో తానేగ్రహించలేక పోతున్నాడనడానికి, నేటిసాహిత్యమే తార్కాణం. తనకే పత్యంచని వంటకాన్ని, తనవారికిచ్చిన వారెలా భుజిస్తారు? ఇతరులకు హృదయపరివర్తన, రసానుభూతి కలిగించడానికిముందు తనహృదయంలో ఆర్ద్రతసూన్యంమైతే, చేయగలిగిన సృష్టియేముంది.

ఈనాటిసాంఘిక పరిస్థితులకు కారణాలుకోకొల్లలు. ఆర్థికదుస్థితి, భావశూన్యతా, ఉదాత్త మనోకామనా నేటి మనలోపాలలో కొన్నిగావున్నాయి. ఈస్థితికి, చారిత్రాత్మకంగా, రాజకీయంగా కారణాలెన్నైనా వుండవచ్చు. కాని పర్యవసానం ఒకటే! నైతిక విలువలేకాదు, జీవితపు మార్గమే మారుత్రోవ పడుతూ వుంది!

ఈదుస్థితి నుండి కొంతవరకైనా తప్పించే గురుతర బాధ్యత స్త్రీరచయిత్రులమీద వుందేమోనను కుంటాను. ఇంతో అంతో దేశీయ సంస్కృతిని, సాంప్రదాయాన్నీ కాపాడుతూవచ్చింది మనస్త్రీలు. మారుతూన్న దేశాన్ని, మారుతూన్న విలువల్నీ గ్రహించకుండా, యింటనున్న స్త్రీలనుచూచి చాలమంది విచారించినా, విలపించినా, వారేపదిలంగాకొన్ని విలువల్ని భద్రపరచారేననే నమ్మకంకలుగుతుంది.

భారతస్త్రీ జీవితపు విలువలు వేరుగా వున్నాయి అనాది సిద్ధంగా. నేటిసంఘర్షణాత్మక పరిస్థితులతాకిడి కవి నిలగలగాలంటే, వాటివిలువల్ని, వేరేదృక్కోణం నుంచి లెక్కకట్టి బేరీజువేయవలసిన అవసరంవుంది. పరిస్థితులకు తలఒగ్గని ధైర్యశాలురు మనకు నేడు కావాలి. అచంచల దీక్షాపరురాలై సేవాభావపు స్నేహవల్లరుల పెంపొందింపజేసే అజేయ బ్రహ్మవాదినులు, సేవికలుకోకొల్లలుగా తయారుకావాలి! చైతన్యమంతమైన బిడ్డల తయారుచేసే విజ్ఞానవంతులూ రాండ్రూ, వివేకవంతురాండ్రూ సమర్ధవంతులూ అయిన మాతృదేవులు కావాలి యీనాడు దేశానికి. ఈలక్ష్యాలను దృష్టిలో వుంచుకోవలసిన అవసరం రచయితలది.

ఈనాటి మన సంస్కృతీ మూలానికే మహాహాని సంభవింప నున్నది. ఈ నేలకు, సరిపడని, పెనుఝంఝూతాలు తెక్కుమిక్కిలిగా వీస్తున్నాయి పాశ్చాత్య సంస్కృతీ ఫలాలు మనకు మేడిపండ్లవుతున్నాయి. అందుకని, కొన్ని వేల వత్సరాలు వెనక్కు మన నేటి కాలప్రవాహాన్ని వెనుదిప్పలేము. ఈకాలపు సుడిగుండాలలో పైకి ఆమూలంగా ఎత్తబడి నేల కూలబడమూ లేక, నిలద్రొక్కుకొనగల సామర్థ్యము సంపాదించడమూ అన్నది నేటి సమస్య! కొత్తపాతల మేలు కలయిక జరిగినగాని ఈనాటి అధునాతన సంస్కృతీ వృక్షం పెంపొందజాలదు.

శూన్యతలో, చీకటిలో దారితెలియక వెతలజెందే సాహితీపరుల సంఖ్య నేడు మిక్కిలిగా నున్నది. ఈనాడు దారిజూపే ఋషిసత్తములను నమ్మే విశ్వాసం మనలో చాలామందికిలేదు, అట్లని మన స్వబుద్ధిపై ఆధారపడగల పటిమ శూన్యం! అటుసనాతనాన్ని, యిటూ అధునాతనాన్ని కలిపి మేళవించి, రసమయ సాహిత్య జగత్తును సృష్టించాల్సిన అవసరం అడుగడుగునా కనిపిస్తుంది.

స్త్రీ ప్రపంచమే నేడు మారబోతున్నది, యుగయుగాలుగా అనగద్రొక్కబడి యున్నామనే నవ చైతన్యపు టుత్సాహంలో అన్నివిలువల్ని తృణీకరించే స్థితికి వచ్చామేమో తిరిగి పునరాలోచించుకోవలసిన అవసరం ముఖ్యంగా స్త్రీ రచయిత్రులకు హెచ్చుగా వుంది. అన్యాయాన్ని ఎదురించడానికి, మనం అన్యాయం తలపెట్టాలా అన్నది సమస్య! అనాహతంగా, అనూయాయంగా వస్తూన్న, అహింసా సిద్ధాంతపు మాటేమిటి! పురుషుడు తనపై అధికారం చెలాయిస్తున్నాడనే అసహనంతో, తిరిగి అసహనంగా ప్రవర్తించవలసిన అవసరం వుందా? ఒకపురుషుని ఝంఝూటనుండి తప్పించుకున్నామనే అహంతో ఎందరో సహాయాన్ని అర్థించడం అవసరమా? అలానే పాతివ్రత్యాన్ని మాతృత్వాన్ని వివిధకోణాలనుంచీ చూచి మన కాలపరిస్థితులబట్టి వాటికి చిక్కదనం, చక్కదనం యిచ్చి మలచుకోవాల్సిన అగత్యం ఏర్పడింది. అంతే తప్ప గుడ్డిగా అనుకరించడం, అవకతవకగా ప్రవర్తించడం అనర్థం! సాహితీపరుల కనీసపు బాధ్యత కొన్ని విలువల్ని సంగ్రహించడం! ఆనాడే సాహిత్యం సంస్కృతికి పతిరక్ష అవుతుంది, ఆనాడే సాహిత్యం సంస్కృతికి దర్పణం కాగలదు.

ఇదేవిధంగా సాంప్రదాయంపేర, సనాతనంపేర, జరిగే అన్యాయాలకు తలబగ్గడం అన్యాయం. సత్యాన్వేషణలో ఎన్నో చిక్కులు ఎన్నో ఇబ్బందులు తప్పవు. అయినా మార్గ దర్శకులు వాటిని ఓరిమితో భరించి, ధరించి వేతనాయుత జీవిత సముద్రాన్ని మథించి అమృతాన్ని చిలకరించ వలసివుంటుంది. ఏది మంచి, ఏదికాదు అనే నిర్ణయంచేయగల శక్తి సామర్థ్యాలు అందరికీ వుండవు. దీనికి కారణం, దీని కావశ్యమైన దీక్షాపటిమ, ఉపకరణ సామగ్రి సమకూర్చుకునే శక్తి సామర్థ్యాలు లేవే! అట్టిశక్తి గడించగల ధీపటిమ సాహితీవేత్తలు పొందాలి!

ఎంతటి ఉదాత్తమమైన రచయిత అయినా భూత కాలాన్ని ధిక్కరించి, వర్తమానాన్ని ఎదిరించి, భవిష్యత్తుపై సవాలుచేసి రచనచేయలేడు. భూతాన్ని పునాదిగా అంగీకరించిన గాని వర్తమానంలో వేళ్లు తన్నలేడు. అప్పుడుగాని భవిష్యత్తు కుసుమాలు మొగ్గ దొడగలేవు. అలాగే తన సంస్కృతిలోనుండి పుట్టి పెరిగి వేళ్లు దన్నిన నమ్మకాలను, విలువల్ని కాలదన్ని బతకాలని తలిస్తే, నేలనుండి పెకలించిన మొక్క మోడైనట్లే రచయితా నిష్ప్రయోజనుడౌతాడు.

సాహితీవేత్త, తన సంస్కృతీ జీవనామృతాన్ని చూరగొంటూ, అమరజీవి కావాలి. అమృతాన్ని యితరులకు అందివ్వాలి.



# సాహిత్యము - సంస్కృతి

## శ్రీమతి టి. లతాదేవి

సాహిత్యంద్వారా సంస్కృతిగాని, సంస్కారంగాని ప్రతిబింబిస్తుందేమోగాని చెప్పుకోదగ్గ మార్పు అంటూ వెంటనే రాకపోవచ్చునేమో !

సమాజంపై ప్రేమ భవిష్యత్‌పై విశ్వాసం రచయితలందరికీ ఒకటే అయినా ధోరణి విభిన్నమార్గాలలో ఉండటంచేత తీసుకురాదల్చుకున్న సంస్కారంగాని పెంపొందింప దల్చుకున్న సంస్కృతికాని అందరికీ లొంగిరాదు. సాహిత్యంద్వారా వచ్చిన లేదా రాబోతున్న సంస్కారాన్ని గురించి చెప్పబోయే ముందు అసలు సాహిత్యపు స్వరూపాన్ని గురించి ఆలోచించటం అవసరం. రచయిత అవడానికి కావల్సిన అర్హత లేమిటని ప్రశ్నిస్తే నిజానికి అలాటివేమీ వెంటనే కనిపించవు ఈ విషయంపైన ఒక సిద్ధాంతం ప్రతి పాదించటం సలహా లివ్వడం అవినయం అనిపించుకుంటుంది.

వివేకవంతుడైన రచయిత విభిన్నమార్గాలలో సాహితీ యవనికమీద ప్రతిఫలిస్తూ ఉంటాడు. ప్రతి ఉత్తమ రచయితకూ తన స్వంతమార్గం అంటూ ఉంటుంది, సృజనాక్రమంలో తనదీ అనే శైలిలేని ఏ రచయితా చిరకాలం నిలబడలేడు. నిజం చెప్పాలంటే మన సాహిత్యం కన్న జీవితం ఎంతో విస్తృతమైనదని నిస్సంశయంగా చెప్పవచ్చును.

ఫొటోగ్రాఫర్ కెమెరా మీటనొక్కగానే కొండలూ, పరుగెడుతున్న హీరో, నృత్యం చేస్తున్న హీరోయినూ ముద్రలు అందులో పడటానికి క్షణంలో సగంచాలు. చిత్రకారుడు మోడల్‌కేసి చాలా సేపు చూస్తాడు. అతని రూపురేఖల్లో స్వభావంజీవితం అంతరంగికమైన ఆర్ద్రిత ప్రతి ఫలిస్తున్నాదేమో, కనిపెడుతున్నట్లు చూస్తాడు అలాగే రచయిత కూడా తన పాత్ర సృష్టికి ముందు అపూర్వమూ, ఆధునికమూ అయిన ఏకాగ్రతనీ తపస్సునీ మలుచుకోవటం, అనివార్యమవుతుంది. అయినా నాకొకటి అనిపిస్తూ ఉంటుంది. మనకంటె ముందురచయితలకు రచనావస్తువు తేలికగా దొరకటం జరిగిందనుకుంటాను.

ఇది వరకు స్థిరపడిన సామాజికచిత్రాన్ని విమర్శించడంగాని లేక ఫొటో తియ్యడంగాని ఒక ఎత్తూ, చరిత్రలో లేని ఒక సమాజాన్ని లేదా ఇప్పుడు నిర్మితమవుతున్న సమాజాన్ని, రచయిత కూడా అందులో భాగస్వామిగా ఉన్న సమాజాన్ని చిత్రించడం మరోఎత్తు. ఈ రెండింటినీ సమన్వయ పరచడానికి ఎంతమాత్రం వీలులేదు.

కాగా అప్రయత్నంగా అందరికి ఒకే ప్రశ్న బయలుదేరుతుంది. నేటి సమాజంలో రచయితల పరిస్థితిఏమిటి అని? వారి కర్తవ్యం తేలికగానే కన్పించ వచ్చును. తను మృత్యుశయ్యపై మూలుగుతూ ప్రాణస్పందనతో చైతన్యమూర్తి అయిన సమాజాన్ని చిత్రించడం తేలికగా అయే పనికాదు. అయినా మరో సంగతి ఆధునిక ఆంధ్ర సాహిత్యంలోని భావదారిద్ర్యం చూస్తే ఆశ్చర్యంవేస్తుంది విమర్శకులూ, విమర్శకే అర్హతలేనివారూ కూడా ఈ విషయాన్ని గురించే ముందు అంటూ ఉంటారు.

గతశతాబ్దంలో పేరుగొన్న రచయితలు ఆంధ్రలో ఇతరదేశాల్తో పోలిస్తే తక్కువనవచ్చును రోమారోలా, డ్రీజర్, షా, గాల్స్‌వర్దీ మొదలైన వారితో పోల్చదగిన వారు మనకులేరు రెండుప్రపంచయుద్ధాల మధ్యకాలంలోనూ ఆధునికమైన రచనలు కొన్ని విశ్వసాహిత్యంలో అవతరించాయి. పశుత్వానికీ మానవత్వానికీ ఉన్న భేదాన్ని చిత్తశుద్ధితో గాఢమైన నిస్పృహతో వర్ణించటం జరిగింది. కొందరు వాళ్లని నిరాశావాదులు అని ఈసడించారు కూడా- అయినా జాతి విచక్షతా విధానం లాభాలు లాగటం మానవుడి నైతిక ఔన్నత్యాన్ని భంగపరిచి ఆత్మనాశనానికి దారితీయడంలాటి ఘోరాలు వారు భయంకరంగా చిత్రించారు.

ప్రస్తుతం అలాకాదు ఒకరకం పాఠకులు పెంపొందారు. నేరాలూ హత్యలూ మొదలయిన వాటినీ, ఒకరకం సెంటిమెంటల్ కథలనీ వాళ్లు చాలా ఇష్టపడతారు. కాని వీళ్లనే దేశం అంతరాత్మ అనిగాని గుండెకాయఅనిగాని అనలేం. ఆలోచించే వాళ్ళెప్పుడూ మంచిసాహిత్యాన్నే కోరతారు.

ఇప్పుడు అమిత విజయవంతం అయిన కొందరి సాహిత్యాన్ని పరిశీలిస్తే అవి ఎలావ్రాశారు? అనేదానికన్నా అవి వేటిని వర్ణించుతున్నాయి అనేదాన్నిబట్టే విజయం ఆధారపడిఉంటుంది. కళలు వికసించి విజయవంతమైన సామరస్యం అవతరించి అద్భుతమైన సాహిత్యం వెలువడేకాలం ప్రతిదేశానికీ సమాజానికీ ఎప్పుడోప్పుడు వస్తుంది. ఆకాలాన్ని ఉన్నతదశ అంటాము. ఆంధ్ర సాహిత్యంలో ఇప్పుడు ఉషఃకాలం ప్రారంభమయిందని

తప్పకుండా అనచ్చును. చరిత్రనిచూస్తే దశాబ్దాలు గంటలుగా తోస్తాయి. ఈ యంత్రయుగయవ్వనంలో రచయితలు టాగూర్‌లూ శరత్‌లూ కాకపోయినా, ఈ సమాజపు భవిష్యత్‌లో తప్పకుండా వారు తిరిగీ మరో సారి జన్మిస్తారు.

ఫ్రాన్సుకి ఈనాడు బాల్జాక్ హ్యూగో జోలాలూ, ఇంగ్లండుకి డికిన్స్ షెల్లీలూ, ఇండియాకి కాళిదాసు పెద్దన్నలూ లేకపోవచ్చును. కాని భవిష్యత్తులోకి తొంగి చూస్తూ ఆత్మవిశ్వాసంతో శాంతిసౌధ నిర్మాణానికి నమూనాలు తయారుచేసే ఉత్తమరచయితలు ఉన్నారు. వారినుంచి ప్రపంచప్రజలు ఆశిస్తున్నది చాలావుంది.

రాత్రి దీపంవెలిగించి ఒకనవల తెరిచి చదవడం ప్రారంభించిన పాఠకుడు ఒకదీర్ఘయాత్రికుడుగా మారి పోతాడు. ఆపుస్తకంలోని మాతృకలు సజీవంగా అతని చుట్టుపట్లే ఉన్నప్పటికీ ఈనవలలో తను కనిపెట్టగలనని ఆశించేదేమిటి? ఆ నవలచరిత్రకి సంబంధించినదయితే కాలజ్ఞానాన్ని వృద్ధిచేసి చరిత్రపుటలకి జీవంపొయ్యచ్చు. తెలియని స్థలానికీ కాలానికీ చెందిన నవలఅయితే విజ్ఞానాభివృద్ధికి పనికివచ్చి భూగోళ పరిజ్ఞానం అధికం అవుతుంది. మరొకరి జీవితంలో అద్దంచూసుకోటానికి హాయిగా ఉంటుంది.

అదిగో అప్పుడే తనకంటె రచయిత మానవుడి ఆంతర్య జీవితాన్ని అధ్యయనం చేశాడనీ యక్స్‌రే కళ్లు అతనికి ఉన్నాయనీ పాఠకుడు భావిస్తాడు లేదా తన సమకాలికుల గురించి ఏదయినా రహస్యం తెలుస్తుం దేమో అనికూడా అతడు ఆశిస్తూ ఉండచ్చును తన జీవితాన్నిగురించి తనే తెలుసుకోడానికి కూడా అతను చదువుతాడు.

రచయిత తీసుకున్న వస్తువు తాలూకుఉన్నతి, విష యాన్నీ పాత్రలనీ ఎంచుకోడంలోనే అధికమవుతూ ఉంటుంది. కాగా ప్రతిరచయితకూ ఒకపరిమితి, అడ్డుగోడలూ, చెలియలి కట్టలూ ఉంటాయి. సామాన్యంగా నవలా రచయిత అయినవాడు తను నివసిస్తున్న సమాజంచేత నడపబడుతాడు. అయినా కూడా తన అనుభవాలూ జ్ఞాపకాలూ అనుభూతులూచేత ప్రభావితుడై రచన సాగిస్తాడు. అప్పుడే అక్కడలేని రచయితకు ఉన్నపాఠకుడికీ మధ్య భావైక్యం అనే ఎలక్ట్రిసిటీ ప్రవహించి వాళ్ళిద్దర్నీ ఒకర్నిచేస్తుంది. ఇది ఉత్తమరచయితకూ విజ్ఞానవంతుడైన పాఠకుడికీ ఉండే అనుబంధం.

కళాకారుని ఆలోచన దృశ్య ఘటనలనీ భావనలకీ కృత్యాలకీ పాళ్లని మార్చవచ్చును. కాని నవలలన్నీ ఆఖరికి ఊహాగానంచేసే నవలలయినా సరే వాస్తవం మీదే ఆధారపడిఉంటాయి విశ్వనాథవారి రచనల్లోని దయ్యాలూ దేవతలూ బాపిరాజుగారి భోగలాలసత ఇవన్ని సమాజ అనుకరణలు కాదని పూర్తిగా అనలేం వాస్తవానికి దూరంగా కళ అనేది లేదుఉండబోదుకూడా.

ఉత్తమరచయిత వినోదంకోసం పేరుప్రతిష్ఠలకోసం వ్రాయడు. జీవితాన్ని మరింత ఉన్నత పథాలను నడపాలనే అతనిధ్యేయం ఈ ధ్యేయానికి సంబం ధించిన పోరాటానికి పుస్తకాన్ని ఒకనైతిక ఖడ్గంగా అతను భావిస్తాడు. ఏనవలలో అయినా ఉన్నత ఆశ యాలలో ప్రేరితుడైన రచయిత సామాజిక అభివృద్ధిని ఆశయంచేసుకొన్న రచయిత, తనుసృష్టించిన పాత్రలలో కొన్నిటికి ప్రాణమూ ధర్మమూ ఉండటం, కొన్ని నిశ్చైతన్యాలూ పతనాలూ ఉండటం గమనిస్తూనే ఉంటాడు. అతనిలోని ఉద్వేగం నిస్సహాయత కాదు. ప్రపంచాన్ని కేవలం నీతి అవినీతులనే రెండు రంగుల్లోనే చిత్రించరాదు ప్రేమలాగానే ద్వేషం కూడా అస్పష్టభావాలకీ సంబంధించనిది కాదు.

ఉద్వేగం లేనిదే నిజమైన కళ లేదనీ ఉండబోదనీ నానమ్మకం. ఆత్మ సంబంధి అయిన రచనలో తనకున్న కొద్ది పాటి జీవితంలోనే ఆతను అనేక జీవితాల్ని జీవిం చాలి. మానవుడి అంతరంగిక జీవితంలో వెలుగుని ఫోకస్ చేసి, అతను దానిని మరింత స్పష్టంగా చూడ టానికీ, సమగ్రంగానూ సగర్వంగానూ జీవించడానికీ రచయాత తోడ్పడాలి.

కేవలం రచనా కౌశల్యం మాత్రమేకాక ఆనవలని పాఠకులు ఆసక్తితో చదివేట్లు దాని సంవిధానం వుండాలి. కౌశల్యం అంటే మాటల కూర్పుకోసం పడే వేదన ఎంతమాత్రంకాదు. స్పష్టమైన వాస్తవికతకి దూరం గాని కల్పనా శక్తికూడా ఉండాలి, సృజనకి అదిప్రాణం

భౌతిక అధ్యాత్మిక విలువల్ని సృష్టించే ప్రతి రచ యితా భౌతిక శాస్త్రవేత్తా రాజకీయవేత్తా అయి ఉంటాడు. కల్పనాశక్తి మంచిదే గాని అది మాత్రమే రచయితకి చాలదు. మేధస్సూ మెరుగూకూడా అవసరం. చరిత్ర క్రమాన్ని అర్థం చేసుకునే సామర్థ్యం ప్రతిభా అతనికి కావాలి. సామాన్యుడి కంటే ప్రతిభ లేని రచయితల్ని మనం ఊహించడం కష్టం ఇపుడు మరీ కష్టం సామాన్యుడు రచయితగా అవుతున్నాడు.

నేడు వివాదప్రదంగా వ్రాయనవసరంలేదు తన ఉనికిని రూపించుకొన్న శాస్త్రీయ సిద్ధాంతాలు ఉన్నాయి అయినా ఆంధ్ర సాహిత్యానికి ఈ మధ్య చిచ్చుబుడ్డి స్థితి పట్టింది ఒక యువక రచయిత ఒక పుస్తకం వ్రాసి ఫరవాలేదనుపించుకుని రెండో పుస్తకంలో శాశ్వతంగా తనవిలువని రాలగొట్టేసుకోటం కనిపిస్తున్నాది. హృదయ కవాటాలకు మనిషి గట్టితాళం వేసుకు కూర్చుంటాడు అవి పగలగొట్టలేని బలహీన రచయిత పైకి కనిపించే షర్టు గుండీల్ని వర్ణించేసి హమ్మయ్య అనుకుంటాడు-కాని తిరిగీ అతనెవ్వరికీ కనిపించడు.

సామాన్యంగా ప్రముఖ రచయితలని తరుచూ ఎదురు కునే ప్రశ్నల్లో మీ రచనల్లోని ఫలానా వ్యక్తి పేరేమిటి? ఎవరిని దృష్టిలో ఉంచుకుని వ్రాశారు? అనేది ముఖ్యమైనది.

నిజంగా అలాఎవరినైనా దృష్టిలోపెట్టుకు వ్రాయటం అనివార్యం అయినా ఆ వ్యక్తులు మారిపోతారు. నిజమైన కళాకారుడు ప్రకృతిని బానిసలాగా కాపీచెయ్యడు దాన్నిమార్చి నూతన రూపాన్ని సృష్టిస్తాడు. యువతీ యువకుల మధ్యజరిగే సంభాషణని షార్ట్‌హాండ్ ద్వారా వ్రాయటమూ ఒకమాహా రచయిత దాన్ని చిత్రించటమూ వేరుగానే ఉంటుంది. రచయిత వారు చెప్పలేని వాటిని కూడా చెపుతాడు సంభాషణా క్రమాన్ని ఇటూ అటూ మారుస్తాడు రంగుల ఫోటోగ్రఫీలో కాకుండా రచయిత అవ్యక్తి యొక్క అసలు వ్యక్తిత్వాన్ని బయిట పెట్టే సంకలనాన్ని సమర్పిస్తాడు. పాత్రసృష్టిలో పోల్లని మాత్రమే కాక లక్ష్యాన్ని కూడా మారుస్తాడు రచయిత. ఒక ప్రఖ్యాత చిత్రకారుడికి ఒక స్నేహితుడు రెండు దంతపు ఏనుగుల్ని చూపించాడట అవిరెండూ ఆగ్రహంలో ఉన్న ఏనుగులకి ప్రతిక్రియలు అందులో ఒకదాన్ని చూసి ఇది బాగుంది కారణం ఏమిటంటే తొండంతోపాటు దంతాన్ని కూడా ఎత్తగలిగింది. ఎవడో బుద్ధి హీనుడు ఇది అవాస్తవికత అని విమర్శించటం వలన నిపుణుడు రెండోదాన్ని మామూలుగానే చెక్కాడు అందుకే అది ప్రత్యేకత లేకుండా పోయింది ఇది శిల్పం కాదు. ఎందుకంటే భావప్రకటనా లేదు కళాలేదు. అన్నాడు ఆ చిత్రకారుడు.

యుద్ధభీభత్సాలని గురించి ఆ చిత్రకారుడు చిత్రిస్తూ శరీర శాస్త్రాన్నికూడా మర్చిపోయి శవాలకి కాళ్ళుండాల్సినచోట చేతులూ. చేతులుండాల్సినచోట కాళ్ళూ వేసినా నూటయాభై ఏళ్ళు గడిచిన అనంతరంకూడా అందులోని వాస్తవికతనిచూసి మనం ఆశ్చర్యపోతాం. సాధారణంగా ఒక నవలలోని పాత్ర అనేకమంది వ్యక్తుల సమ్మేళనం. అనేకమందిని అనేక పరిస్థితుల్లో పరిశీలించిన అనంతరం ఒక మహారచయిత ఒక పాత్రని నిర్మించడం జరుగుతుంది. దాంట్లో తన యావజ్జీవిత అనుభవాన్ని చిత్రించడంకూడా అప్పుడప్పుడు కనిపిస్తుంది. బుచ్చిబాబుగారి దయానిధీ, శ్రీదేవిగారి ఇందిరా అలాటిపాత్రలు. ఇందిర ఇప్పుడు ఇక్కడ మనమధ్యే కనిపిస్తుంది.

ఆధునిక రచయితయొక్క మానసిక ప్రయోజనాల సమగ్ర రూపాన్ని అర్థం చేసుకోడం అంత తేలికకాదు. రచయిత మనలాటివాడే అయినా అతని నడవడికలోనూ జీవితంలోనూమనకి అద్భుతాలేకనిపిస్తూ ఉంటాయి. వాటిలో మనకి తగినంత పరిచయమూ ఉండదు. ప్రాణాధికమైన నవలల్లోని పాత్రల జన్మల గురించి తెలుసు కావాలంటే ఆ రచయిత ఉత్తరాలనీ, డైరీనీ తిరగేయాలి. అతని సమకాలికుల అనుభవాల్ని అతని అనుభూతులతో ఐక్యపరచాలి. అప్పుడు అది ఎవరినీ ప్రత్యేకంగా దృష్టిలో పెట్టుకుని వ్రాసింది కాదనీ అనేకమంది వ్యక్తుల పరిచయానంతరం ఆ సృష్టి జరిగిందనీ మనకి అర్థం అవుతుంది. ఏదో ఆకస్మాత్తుగా జరిగే సంఘటన రచయితని ఆకర్షించ వచ్చును. అది అప్పటికప్పుడే వ్రాయక పోయినా ఎప్పుడో సమయానుకూలంగా అది వ్రాయటం తప్పకుండా జరుగుతుంది. కాని మానవుడి మామూలు జీవితానికి విభిన్నమైన సంఘటనలే రచయితని ఎక్కువగా ఆకర్షిస్తాయి.

ఒక నవలలోని పాత్రలు ఆల్బమ్ అంటానికి వీలులేదు డైరీ అంతకన్నాకాదు. జీవితాన్ని తరచి జీవంనింపిన సజీవమూర్తుల సామాజిక చిత్రం నవల. మేడంబావరీ నవలలో ఎమ్మా ఎవరనే ప్రశ్న చాలామంది వాదవివాదాలకు కారణం అయింది. ఫ్లాబర్ట్ అనేకమంది ఆడవాళ్ళని కలుసుకున్న అనంతరమే ఎమ్మాని చిత్రించి వుంటాడు. కాని ఎమ్మాని నేనే అని ఫ్లాబర్ట్ ఎవరికో ఉత్తరం వ్రాశాడట. ఉన్నత రసపిపాసీ వికృతపు దృశ్యచారీ అయిన ఈ రచయిత తననితాను ఆడదానిగా ఊహించుకోటంలో ఆశ్చర్యంలేదు. జీవితంలోకన్న సాహిత్యంలో అడంబరత అతనికి ఎక్కువ. కొందరి రచన భవన నిర్మాణంలా ఉండి వంటిల్లూ డ్రాయింగురూమూ పడకగదీ ప్లాను ప్రకారం అఘోరిస్తాయి. ఆరుంబాతిక ఇంటికి నడవ ఎన్నిగజాలుంటుందో అందరి కొలతలూ

ఒకటే. ప్రేమా నీతీ పాతివ్రత్యం మోతాదులోపడి తెలుగు సినిమాలాగా తయారయ్యే నవలలు మనకి లేకపోలేదు. నీడకు రక్తమాంసాలు కూర్చి ప్రాణప్రతిష్ట చేసిన అనంతరం, తను అనుకున్నట్లు ఆమూర్తి కనిపించని సమయాల్లోకూడా దాని స్వయం సృష్టికి మహారచయిత సంతోషిస్తూనే ఉంటాడు. సుదీర్ఘమైన నవల వ్రాసిన అనంతరం కూడా ఏ ప్రాణినీ యావజ్జీవతం చిత్రించలేం అందుకే ముఖ్యమైనవి ఒకటో రెండో ఎన్నుకుంటాడు. ఆ వ్యక్తి జీవితంలో ఏదో ఒక రోజుని పూర్తిగా వర్ణించి పదేళ్ళ బ్రతుకుని గురించి ఒక్క ముక్క కూడా వ్రాయకపోవచ్చును. అతని పినతల్లి విధవ కూతుర్ని గురించి వ్రాసి భార్యని గురించి వదిలి వేయవచ్చును. అతని ముక్కుని గురించి చెప్పి వయసుని వదిలిపెట్టచ్చును. లేదా విశ్వనాధవారిలాగా మనిషి మడమపడి నీడునిలిచినచోటని కూడా వర్ణించవచ్చును. నవల వారపత్రికలోని వంటింటి కథకాదు. వాల్ పోస్టర్ చిత్రరచనా కాదు.

ఒక యువకుడు ప్రియురాల్నిగురించి ఆలోచించడం మానిన తరువాతయినా అంతవరకూ ప్రేమగోలతో విసిగెత్తిన పాఠకుడికి ఇతనెవరు? డాక్టరా— నటుడా— పార్లమెంటు సభ్యుడా అన్నప్రశ్న- దానివెంట పరిసరాల పరిశీలనా అవసరం అవుతుంది.

తెలుగులోమామూలురచయితఏంవ్రాస్తూపోతున్నాడో తల్చుకుంటే చిత్రంగాఉంటుంది. మైనపు బొమ్మల్ని వరసగా పెడతాడు. ప్రేమఆదర్శం, దంపతుల చిలిపికయ్యం బుడుగుగాడి ముసిలి మాటలు, అద్దెకొంపల అగచాట్లు, మొదలయినవి. జయప్రదం కాని తెలుగునవలలో ఇవే కనిపిస్తూ ఉంటాయి. జీవితం నవల లాటిది కావచ్చును. నవల మామూలు పచారీ కొట్టు జీవితం లాటిది మాత్రంకాదు నిర్జీవంగా పోటీలలో నిలబెట్టి ఒక్క దుర్గుణంకూడా లేనిపాత్రలలో నింపి సర్వగుణ సంపెంగల్ని రూళ్ళకర్ర ధోరణిలో వ్రాసిన పుస్తకాలు సంస్కారాన్ని తేలేవు సరిగదా కాలక్షేపం కూడా కాదు. దేశానికి పెట్రోలూ బొగ్గూ అవసరం అయినట్లుగానే మనస్సుకి రోమాన్స్ కావలసిన కాలం వస్తుంది. నిరాడంబరం అసహజ పరిస్థితులు కూడా అప్పుడప్పుడు అవసరమే అవుతాయి.

సాహిత్యం ప్రజల్ని జ్ఞానవంతులుగా చేసి మంచిజీవితానికి సహాయంచేస్తుంది. ఈరాగబంధంతోనే రచయిత సమాజానికి తనని తనుబంధించు కొంటున్నాడు. ఏ యుగాన్ని పరిశీలించినా రచయిత స్వప్నం మానవత్వాన్ని పెంపొందించడంమే. ఆస్వప్నం ఈనాడు నిజంఅయింది. ప్రముఖవ్యక్తుల మేధస్సువలనా, ప్రజాస్వామికం వలనా దేశపాలన జరుగుతున్న ఈసమయంలో రచయితలకి అవకాశాలు అధికంగాఉన్నా సమస్యలు లేకపోవటంవలన డల్‌గా తయారయి మొనాటమీతో బాధపడుతున్నారు. అప్పుడే నవలా రచనలో తాత్వికత అవసరం అవుతుంది. ఇప్పటి ఆలోచనాపరులు వేరు ఇదివరకు వేరు. ఉత్తరాన్నిచూస్తే వాళ్ళ మేధస్సు మనకి దిగ్భ్రాంతి కలిగిస్తుంది. సాహిత్యంలో ప్రతిబింబించిన వారికన్న వీరే గొప్పవాళ్లు అనుకుంటాను.

వీరిలో సంస్కారం ఎక్కువ. అందుకే భవిష్యత్తులోకి ఆశగా చూస్తూఉంటాను. ఆంధ్ర యువతీయువకులు తాత్వికతకోసం ఎదురుతెన్నులు కాస్తున్నారు. మన సమాజస్థితినీ నైతికమైనవిలువలూ వీరెంత ఉన్నతులో అంత ఉన్నతమైన సాహిత్యాన్ని ఆశిస్తున్నారు. అదివస్తే, సంస్కృతితో పాటు సంస్కారమూ పెరుగుతుంది.

కాల్పనికతతో కూడినవాస్తవికతలో బాటు వాస్తవికతకూడా. అవసరం.

రచయిత ఇంద్రజాలికుడు కాదు. మహామానవుడు. మానవత్వంమీద మమతలో తనని తాను నిలుపుకుంటున్న ఆశాజీవి. మహారచయిత సంస్కారాన్ని తేవటమేకాదు. చరిత్రనే నియమించగలడు— సంస్కృతీ స్వరూపాన్ని గురించి సమగ్రంగా చెప్పాలంటే సాధ్యంకాకపోయినా పుష్పించిన నాగరికతనుంచి సంస్కృతి పొటమరిస్తుంది. దానినుండి సంస్కారం రావచ్చును. తొలి మానవుడు ఆహారనిద్రలతోనే తృప్తిపడి తనబుద్ధిని వినియోగించక పరిసర పరిశీలన చెయ్యకపోతే జీవితం అతనికి లొంగి రాకపొయ్యేదేమో. అతను శాంతి సుఖాన్వేషియై నిర్మించుకున్న సంస్థల సాముదాయకమే నాగరికత. అయితే ఇది అన్నికాలాల్లో అన్నిదేశాల్లోనూ ఒకమాదిరిగాఉండదు. ఆయా విభిన్న నాగరికతని బట్టి సంస్కృతి నిర్ణయమవుతుంది. శ్రేయోసహితమైన ప్రగతినిపట్టి ఆయాసంస్కృతుల విలువ నిర్ణయింప బడుతుంది. సంస్కృతి విన్యాసాలలో సాహిత్యం ఒక ముఖ్యాంగం.

నాటిక

# ఆస్థి కోసం

### శ్రీ పాలగిరి వేణూజయదేవ్

[సమయం మధ్యాహ్నం 10—30 గం॥ అయ్యుంటుంది; స్టేజిమీద రెండు కుర్చీలు టేబిలూ వుంటాయి; టేబిల్ మీద రేడియో; ఫ్లవర్ జార్, గోడకు క్యాలండర్లువుంటాయి.

రామారావు భుజంమీదున్న టవల్ని చేతిలోకి తీసుకొని తుడుచుకొంటూ రంగంలోనికి ప్రవేశిస్తాడు]

రామారావు: ఏమివంటరా బాబూ! తినలేక చస్తున్నాం!! ఈ ఆడవాళ్ళతో వేగలేకపోతున్నాం! కూరలో వుప్పుంటే కారంవుండదు, కారంవుంటే వుప్పుండదు; రెండూ వుంటే కూరే వుండదు. ఇంతకూ వాళ్ళనని ఏమిలాభం .. మనఖర్మ. ...

(శారద ప్రవేశిస్తూ.... కొంగుతో చేయితుడుచుకొంటూ....)

శా: ఏమిటండోయ్! ఖర్మంటున్నారు?

రా: అదే! అదే! మా ఖర్మ....

శా: ఖర్మమేమిటండి! ఇపుడేం వచ్చిందని వాపోతున్నారు?

రా: వాపోవడం కాదు..... విచారపడడం....?

శా: ఎందుకని?

రా: నీలాంటి ఆడదాన్ని ప్రేమించి పెళ్ళి చేసుకొన్నందుకు?

శా: అంటే! ఇన్నాళ్ళులేని విచారం.... ఇపుడెందుకు కల్గిందా అని....

రా: ఎందుకు కల్గిందా!... నీ వంటవుంది చూశావ్....;

శా: చూశాను.

రా: ఏవిటి చూశావ్! నాముఖం చూశావ్!!

శా: చూస్తున్నానుగా ఏడేళ్ళనుంచి.....

రా: ఏవిటి? నా ముఖమా!!

శా: అవును

రా: ఛా! అందుకనే నా ఖర్మంటున్నా!

శా: ఇంతకూ ఏం జరిగింది?

రా: నీవుచేసిన పులుసులో కారంవుందా వుప్పుందా చెప్పు?

శా: ఏవిటి పులుసా! నేను చేయలేదుగా ఈవేళ....

రా: చేయలేదూ! ఇంకేం చేశావ్ ఈవేళ.......

శా: వంకాయ కారపుకూర వండాను. చాలబావుంది కదూ!

రా: ఓహో! వంకాయల వేపుడు చేశావన్నమాట...

శా: అవునండి....

రా: నాకేమో పులుసు వేశావ్? వంకాయ వేపుడు లేకుండానే...

శా: ఏమిటీ! మీరు వంకాయలవేపుడు తినలేదూ!.... ఆ!... క్షమించండి.... అయినా! మీరు నాపెళ్ళి చూపులనాటి ముచ్చట్లు చెప్తుంటే ఆ ఆనందంతో పరవశమై ఈ వేళ, వేపుడు వడ్డించబోయి రాత్రి పులుసు వడ్డించినట్లున్నాను......

రా: రాత్రి పులుసు వేశావన్నమాట.... మంచిపని చేశావ్! పులుసు ఏదో వాసన వేస్తున్నా, వాసన మామూలుగాదా! అని తినేశా....

శా: క్షమించండి...

రా: క్షమించక తప్పుతుందా ఆ! ఇందిరాగాంధీ చెప్పినట్లు మొగాళ్ళు కూడ వంటనేర్చుకొంటే....

శా: పంచకోళ్ళ కషాయం తయారవుతుంది.

రా: అందాకా ఎందుకు? మీరే చేస్తున్నారుగా కషాయాలు; మా గొంతులో పోస్తున్నారు... మేము మ్రింగుతున్నాం.... ఆ!! ఎవరో చెప్పారు? ఈ కాలపు స్త్రీలు, వంట ఘష్టుగాచేసి, పురుషులకు పెడితే, పురుషులు బలిసి, స్త్రీజాతిని కేర్ చేయరని....

శా: ఎవడా చెప్పింది? యింకా ఏమన్నాడో శల వియ్యండి?

రా: పంచకోళ్ళ కషాయాలు చేస్తున్నారు... అలానే చేస్తూంటే స్త్రీ జాతి వంట వద్దురా బాబూ! అంటూ, వంట, వాడే చేసుకొని ఆడదానికి కూడా యింత పెడ్తాడు....

శా: అపుడు ఆడది ఏం చేయాలి?

రా: కాలుమీద కాలు వేసుకొని కూని రాగాలు తీస్తారు .... మేమేమో మా పూర్వులయిన, నల భీమాదులని తలచుకొంటూ పొయ్యిదగ్గర వుసూరు మంటుంటాం...

శా: సంపాదన కావాలిగా?...

రా: అవును సంపాదన కావాలి... భుక్తి జరగాలి... మొగాడు ప్రొద్దున్నే లేచి, ప్రొయ్యి అంటించి, కాఫీ చేసి, భార్యని లేపి, కాఫీ యిస్తాడు.... పది గంటలలోపుగా వంట చేసి ఆఫీసుకెళ్తాడు.... అమ్మగారు క్లబ్ కెళ్తుందనుకో! ఆఫీసునుండి వస్తూనే వంట వగైరా! క్లబ్ నుండి వస్తూనే "అవి బాగులేదు, ఇవి బాగులేదు" అంటూ అమ్మ గారి దబాయింపు....

శా: చాలు! చాలు!! యిక చెప్పకండి... ఇంతకూ మీ ఆఫీసులో ఏదైనా మీటింగా....

రా: మీటింగా! మీటింగేమిటి నీ ముఖంలాగా!!

శా: లేకపోతే! ఇంత సేపూ అలసిపోకుండా "వంట" మీద లెక్చరిస్తున్నారు?

రా: ఆ! ఏం!! లెక్చరులే.... నేను లెక్చరిస్తూంటే గంటల సేపు ప్రజలు నోర్లు తెరుచుకొని వినేవారు ఆనాడు.... కాని ఈ నాడు లెక్చరిస్తే వినే వెధవలుండద్దూ. ..

శా: అవును లేండి! వెధవ లెక్చర్ ఎవరువింటారు?

రా: అవును...: (వులిక్కిపడి) ఆ! ఏవిటీ!! నేను వెధవనన్న మాట; నీ దృష్టిలోనే చెప్పేది వెధవ కూతలన్నమాట.... అవున్లే!.... ఈ కాలం నాటి స్త్రీకి తన భర్తని యిలాంటి మాటలు అనడం పరిపాటి అయిపోయిందనుకో.... ఇదంతా మొగాడు చేసుకొన్న పుణ్యం.... మొగాడు అయి పుట్టి ఆడదానికి మొగుడు కావడంకన్న ఏ కాఫీ హోటళ్ళోనైన కాఫీ కప్పైపుడట్టం మేలు.....

శా: అంటే మీ బ్రతుకు కాఫీ కప్పన్నమాట....

రా: అనే అను!... ఈ నాడు కాఫీ కప్పం టావ్; కొన్నాళ్ళకు పనికిరాని దమ్మిడీ అంటావ్... అంతకూనాజన్మ మా మొగజన్మ చేసుకున్న ఖర్మలే

శా: ఊరుకోండి ఏదో నోరుజారింది. మీతో వాదించే కన్న గ్రుక్కెడు మంచినీళ్ళు త్రాగి వూరుకోనేది మేలు....ఆ! నే వెళ్తున్నా! మీతో వాదిస్తూ కూర్చుంటే అవతల పనులెలా జరుగుతవి....

(శారద వెళ్ళిపోతుంది)

రా: బోల్డు పనిలే! వెళ్లు! వెళ్లు! భర్తతో కొంత సేపు ప్రేమగా మాట్లాడుదామని ధ్యాసేలేదు, ఎంత సేపు వంట...అదీ....యిదీను....

(గోడ వంకికున్న షర్టును వేసుకొంటూ ఈల వేసు కొంటూంటాడు. శారద మళ్ళీ ప్రవేశిస్తుంది.

శా: ఏమండీ!

రా: ఏ మొచ్చిందని మళ్ళీ వచ్చావ్? వంటపని చూచు కోక....

శా: మీకు వంటధ్యాస తప్ప యింకే ధ్యాసాలేదు.... ఎంత సేపు వంట. అవున్లెండి తిమ్మరాజుకు తిండి మీదే చూపు.

రా: ఏమిటంటున్నావ్? నేను తిమ్మరాజునన్నమాట సర్లే యింట్లో వంటచేసే టప్పుడే ముప్పావుభాగం ముందుగానే ముగుస్తుంది అందుకేగా!

శా: అవున్లేండి. ముప్పావుభాగం ముందుగా ముగు స్తూంటే పావుభాగం తిని పిప్పళ్ళ బస్తాలా తయా రవుతున్నారన్న మాట .... ఆ! మరిచాను .... చూడండీ! నెల్లూరునుండి వెంకట్రావు బాబయ్యే గారు ఈ మహాపట్టణానికి రెండు రోజుల్లో వేం చేయబోతున్నారని అధికారరీత్యా వార్త అందింది.

రా: (ఉన్నట్లుండి ఆశ్చర్యపడి) ఏమిటన్నావ్?

శా: అదే! అదే!! వెంకట్రావు బాబయ్యగారు వస్తు న్నారు....

రా: ఏవిటీ! వెంకట్రావు మామయ్యా! ఇక్కడికి రెండు రోజుల్లోనా. చచ్చాంపో,

శా: ఎందుకండీ! అంత బెంబేలు పడ్తారు?

రా: ఇంకేం బెంబేలే భామామణీ! అతగాడు వేం చేశాడంటే మన ప్రాణాలు తోడేశాడన్నమాట.

ఈ కరువు రోజుల్లో అందులోనూ ఈ మహోపట్ట ణానికి అతిథులు వచ్చారంటే మనగతి ఏంకావాలి బాభ్బాబూ! అతనురానూవద్దు మన కాకష్టాలువద్దు అందులో ఈ మామయ్యా వచ్చాడంటే 'అప్పు'— భయం.

శా: అప్పుభయమా! అలాగయితే ఎలాగండీ?

రా: అవున్లే అప్పు మనకోసం పుడితే, మనం అప్పు కోసం పుట్టాం.

శా: అతను ఎవరూ కాదాయె; మీ అమ్మకు తోడ బుట్టిన అన్నగారూ, నాకేమో పరసకి బాబాయి అవుతారాయె పాపం వయసుమళ్ళినవాడు, ఏదో ప్రేమతో వస్తానంటే

రా: ప్రేమతో వస్తాడు ధీమాగా నాల్గు నెలలుం టాడు. అతనిఖర్చు నా జీతంకంటె హెచ్చు....

శా: ఫర్వాలేదు లెండి....అతనికేం లక్షాధికారి.

రా: చాలు! చాలు!! లక్షాధికారట లక్షాధికారి.... అతనికంటె బజారునబడే బిక్షాధికారిమేలు, వున్నం తలో తృప్తిపడతాడు, ఇతడు మొలకు డబ్బుమూట కట్టాడేగాని ఒక్క నయాపైసా ఖర్చు పెట్టడు. పైసాకు పైసాచేర్చి ధనం చేరుస్తున్నాడేగాని కడుపుకుకూడా స్వంతడబ్బుతో మెక్కడు, వుప వాసమన్నా వుంటాడేగాని.

శా: అలా అనకండి. పాపం వయసు తిరిగినవాడు. ఉత్తరంలో మనమంటే అతనికి ఎంతో ప్రేమ వున్నట్లు మిమ్మల్ని మరీమరీ పొగిడి వ్రాశాడండీ.

రా: పొగడ్తలకే ఐస్ అయితే ఎలాగే? పొగడడం కూడ విద్యలే, కూటికోసం కోటివిద్యలు.

శా: ఇంతకూ మీరనేదేమిటి?

రా: నేననేదేముంటుంది; అతను రాకుండా వుండడం మన మేలంటాను.

శా: రాకుండా ఎలావుంటాడు; రెండురోజుల్లో వస్తు న్నాడుగా! కొన్నాళ్ళుండి అతని దారిన అతను పోతాడు.

రా: పోతాడు పోతాడు, సరాసరి కైలాసానికే పోతాడు. ఎప్పుడొచ్చినా మనల్ని వేధించుకు తింటాడేగాని హాయిగాతిని కాలక్షేపం చేస్తాడా! ఛ! ఛ! వెధవబ్రతుకు. అలాంటివాళ్ళు పుట్టి మన దేశానికి ఏమిసేవ చేస్తున్నారు?

శా: అహో! మీరు చేస్తున్నారుగా సేవటసేవ.

రా: నా సేవకేంగాని జరుగబోయేది ఆలోచించు. మామయ్యా నశ్యానికి, అరటిపళ్ళకు, బత్తాయి పండ్లకే అవుతుందే బోలెడుఖర్చు. ఎలా భరిస్తాం.

శా: ఎలాగో అలా భరిద్దాం.

రా: అవున్లే! ముత్తాతలు సంపాదించారుగా మూడు ముంతలు, ఎలాగైనా భరించవచ్చు.

శా: అది కాదండీ! నాకు పాలుపోవడం లేదండీ!

రా: పాలెట్లా పోతుంది. బుర్రుంటెగదూ! మనము అతనిలాగా ఆస్థిపాస్థి వున్నవారం గాదాయె! ఆ మాటలు చూశావ్!(అక్షనుతో) ఒరేయి రామా రావూ!! ఆపీసు నుండి యింటి కొచ్చేటపుడు నశ్యం డబ్బా, ఒకడజను పచ్చఅరటిపళ్ళు తీసుకు రారా అని ప్రేమగాచెప్తాడే కాని మొలనుండి డబ్బుతీసి 'నాయనా. ఈ డబ్బుతీసుకొని ఫలానా తీసికొనిరారా!' అని చస్తేచెప్పడే. కొండమీదున్న కోతైనా క్రిందకు దిగుతుందేగాని అతని మొల నుండిమాత్రం నయాపైసా బైటికిరాదు.

శా: సర్లేండి, ఉపమానాలు మీరూనూ, బాబయ్యా రావడానికి రెండు రోజులుందిగా, వద్దని టెలిగ్రాం యిస్తే.

రా: (తలగోక్కుంటూ) ఏం బావుంటుంది!

శా: అన్నీ మీరేచెప్తారు?

రా: వస్తేరానీ! (అంటూ చేతికున్న వాచ్ వైపు చూచుకొని) అరే అప్పుడే పదకొండు అయిందే! అఫీసుకు యింతదూరం వుషూరు మంటూ వెళ్తే ఆఫీసర్ ఏమంటాడో! ఛీ వెధవ బ్రతుకు.

శా: (వులిక్కిపడి) ఎవరిదండీ!

రా: నీదీ నాదీను. ఇంతకూ ముసలాడొస్తాడంటావ్? అతని జబ్బులకే మన జీతం చాలదు, "జ్వరంరా నాయనా!" అంటాడు, చేయిచూస్తే మంచుగడ్డ లాగావుంటుంది.

శా: మంచుగడ్డా!

రా: ఇది జ్వరంకాదు స్వామీ అంటే, శీతజ్వరమం టాడు. ఎలా వేగాలోమరి. అతను ముందోసారి వచ్చినప్పుడే వందరూపాయలు అయ్యాయి. మళ్ళీ

ఈసారిఎంతో! నాఖర్మ! నేను సంపాదించిందంతా సమయంవస్తే చేతిలో కానీ నిల్వలేదు.

శా: ఏమండీ! అలావాపోతారు? ఆయనవస్తే నాకు బాధేగదూ!

రా: భలే బాధ పాపం.

శా: చారులో వుప్పులేదే! పచ్చడిలో కారంలేదే అంటూ రాగాలు తీస్తాడు!

రా: అతురాలా నిజం.

శా: ప్రొద్దున్నే వేడినీళ్ళు తోడాలా!

రా: తోడాలా మరి.

శా: స్నానంచేస్తూనే స్వయంగా వుతికిన గుడ్డలు యివ్వాలా.

రా: యివ్వాలా మరి.

శా: వెంటనే సంధ్యావందనానికి, పూజకు ఏర్పాటు చేయాలా మరి.

రా; చేయాలా మరి.

శా; భోజనంచేశాక "బ్రతుకు జీవుడా" అని విశ్ర మిద్దామంటే కాళ్ళు పట్ట మంటాడు.

రా: ఇంకానయం. నిద్రొచ్చేవరకూ జోకొట్టిపాటలు పాడమనడూ.

శా: అపుడపుడు రామాయణం, భాగవతం చదవ మంటాడా!

రా: అనడూ మరి పెద్దవాడు.... మీ బాబాయి....

శా: ఇదంతా మీకు ఎగతాళిగా వుంది; అనుభవిస్తే గాని ఆబాధ తెలియదు....

రా: శారదా! ఒక పని చేద్దాం.... రేపు ప్రొద్దున్నే తలుపు తాళమేసి ప్రక్కింట వారితో వూరికెళ్ళా మని చెప్పమని, నాల్గు పూటలు. ఏదో హోటళ్ళో గడిపేద్దాం....ఇలా హాయిగా వుంటుంది... మనకీ ఖర్మ తప్పుతుంది.....

శా: అవునండి; నిజమేనండి;

రా: అలాగే చేద్దాం... నే ఆఫీసుకెళ్లొస్తా మరి.... (అంటూ టేబుల్ మీదున్న ఫైల్ను అందుకో బోతాడు; శారద ఆలోచిస్తోంటుంది....)

శా: ఏమండీ?

రా: ఏం?

శా: ఆయనకెంత ఆస్థి వుంటుంది?

రా: కనీసం ఒకలక్ష; పైచిలుకు ఇరవై వేలు

శా: వారసులు?

రా: పిల్లలు లేరు ... నాకు తెలిసినంతవరకూ!...

శా: అబ్బా! ఎంత వుపాయం కల్గిందండీ!

రా: నాకా!

శా: ఆ! మీకూ ఐడియాలు కల్గితే మనం ఎప్పుడో బాగుపడి వుండేవాళ్లం. నాకేనండి.... నాకే నండీ....

రా: ఏమిటి? నీకూ తట్టింది.... చెప్పుమరి (అంటూ చెవిని శారదవైపు చూపిస్తాడు; శారద చెవిలో చెప్తుంది ...) (సంతోషంగా) ఎంత ఐడియా చెప్పావ్! నాకింత ఐడియా జన్మలో తట్టలేదు.... అంతకూ రామారావు భార్య అనిపించుకొన్నా వన్నమాట... స్త్రీ బుద్ధి ప్రళయాంతకః అని వూరికే అన్నారు.... థ్యాంక్యూ వెరీమచ్ డార్లింగ్,

శా: (సిగ్గుతో) సకసెస్ అవాలి గదాండి.

రా: దేవుడుదయ జూపితే, ఆ! నేవస్తా! ఆఫీసుకు టైమయింది.

శా: మరి నాటకం సంగతో!,

రా: మావయ్య రాకతో నాటకం ప్రారంభం (అంటూ వెళ్ళబోతుంటాడు,)

శా: సర్లెండి; వచ్చేటపుడు నశ్యం డబ్బా ఒకటి తీసు కొని రాండి. ఆ! మరిచాను. ఆ చేత్తోనే గులాబీలు తీసుకొని రాండి, (అలాగే! అంటూ రామారావు వెళ్ళబోతూంటే తెర వ్రాలును.)

(ఇంకా వుంది)



# కస్తూరి

## శ్రీ ఏ. ఎస్. రామారావు

కస్తూరికి శంకరంతో పెళ్ళయి పోయింది. మిగతా తంతుకూడా జరిగిపోయి పెద్దలంతా గదిబయటకొచ్చి తలుపులుకూడా వేసేరు.

కాని కస్తూరికి తలపులకు తలుపులు వెయ్యడం ఎవరి తరం?

కస్తూరికి తనకొద్దిపాటి జీవితంలోనే అనుకోని సంఘటన జరిగిపోయింది. తనకు శంకరంతోపెళ్ళవు తుందనికాని, తాను ఎదురుచెప్పకుండా ఈపెళ్ళికి తల వంచుతుందనికాని కలలోకూడా అనుకోలేదు. కాని, విధి వ్రాసిన వ్రాతలను తప్పించడం ఎవరి శక్యం?

కస్తూరి ఆయింట్లొ పండిన తొలిపంట. అన్ని ముద్దూ ముచ్చట్లనూ అనుభవించింది. గారాబంతోమొద్దు బారిపోక, తెలివితేటలకు పుట్టినిల్లపించుకుంది. అందుకు తోడు రూపం, గుణం పెట్టని భూషణాలుగా అమరినాయి. కస్తూరి యిష్టా యిష్టాలకు ఎదురు చెప్పకుండా ఆమెకు చదువు చెప్పించారు. ఆ తల్లిదండ్రుల కష్టానికి ఫలితంగా మొదటిసారే మంచిమార్కులతో స్కూలుఫైనలు పరీక్ష ప్యాసయింది కస్తూరి. ఈలోగా కస్తూరి తరువాత పిల్లలు ఎదిగిరావడం, సంసారభారం పెరగడంతో కస్తూరి పైచదువుకు విధిగా స్వస్తి చెప్పవల్సి వచ్చింది. యిలాంటి పరిస్థితులు ఈనాటి మధ్యతరగతి కుటుంబాలలో అసాధారణం కాదు.

విద్యా సంపర్కంతో కస్తూరి ఈప్రపంచాన్ని గురించి కొన్ని అభిప్రాయాలను ఏర్పరుచుకుంది. తన భవిష్య త్తును గురించికూడా ఆమె కొన్ని నిర్ణయాలకు వచ్చింది. వాటిలో ముఖ్యమైనవి: తానే కొడుకై జన్మించివుంటే ఆ వయస్సులో, ఆమాత్రం చదువుతో ఉద్యోగం చేస్తూ, తండ్రి సంపాదనకు వేన్నీళ్ళకు చన్నీళ్ళ తోడన్నట్లు కుటుంబానికి ఆసరాగా వుండాలన్నది. అంటే తాను ఉద్యోగంలో ప్రవేశించాలన్నది మొదటినిర్ణయం.. తన వ్యక్తిత్వానికి సంబంధించిన విషయాలలో ఏనిర్ణయమూ చేసుకునే హక్కు తనకే వుందనేది ఆమెరెండోలక్ష్యం.

కస్తూరి లక్ష్యాలలో మొదటిదానికి ఆ యింట్లో ఎవరి అవరోధమూ కలుగలేదు. అందుకే ఉద్యోగంలో ప్రవేశిం చింది. యిక రెండోవిషయంలో ఆమె తనకు తానుగా ఓట మిని అంగీంచక తప్పలేదు. ఏపరిస్థితుల్లో అయితే ఆమె జీవితంతో తొలిసారిగా ఓడిపోయిందో, అవి తన భావి జీవితాన్ని సుఖమయం చేస్తాయా అనే భయసందేహాలు కస్తూరిని పీడించసాగినయి. కస్తూరి భయానికి కారణాలు అనేకం వున్నాయి. భయంతో కసూరి ఆపాద మస్తకం కంపించి పోయింది.

సారెగదిలోని నిశ్శబ్దం కస్తూరిని మరింతగా భయ కంపింతురాలిని చేసింది. ఆ గదిలో ఆవరించుకున్న అగ రొత్తుల వాసనలుకాని, మెత్తని శయ్యపై వెదజల్లిన కుసుమాల పరిమళాలు కాని, ఆమెనా అవస్థనుండి మర ల్చలేకపోయాయి. ఆమె మనసులో గతరాత్రి గడిచిన సంఘటనలే మెదుల్తూ, తన భవష్యత్తును నిర్ణయించుకో లేకుండా చేసినయి.

గడచిన రాత్రి తన పెళ్ళికి వచ్చిన చిన్ననాటి స్నేహి తురాళ్ళూ, ఆఫీసులో తనతోపాటు పనిచేస్తున్న ఆడ గుమస్తాలూ తనచుట్టూ చేరి, తనకు శంకరంతో పెళ్ళవు తుండడంచూసి, విస్మయాన్ని ప్రకటించారు. అంతటితో సరిపెట్టక, ఆశయాలకు ఆచరణకూ గలదూరాన్ని వేలెత్తి చూపించి తననెత్తిపొడిచారు. అలా వాళ్ళంతా మాట్లా తూవుంటే చెవులిక్కిరించి వినడంకంటే తనేమీచేయ లేకపోయింది. ఎవరికి తెల్సుసు తన ఎదలోని బాధ? ఎవరు అర్థం చేసుకోగలరు.

ఇలాంటి పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుందని ఆనాడు— తను ఈపెళ్లికి ఒప్పుకున్నప్పుడే తనకు తెలుసు. తన ఆశయాలు అసాధ్యాలని, పరిస్థితులకు మనుషులు తలవంచక తప్పదని ఆనాడే అర్థంచేసుకుంది. స్నేహితురాళ్ళందరూ తనను అపహాస్యం చేయడానికి కారణం తనేకనుక బదులు చెప్పలేకపోయింది.

తను చదువుకుంటున్న రోజుల్లో ప్రేమకూ, పెళ్లికీ వున్న అవినాభావ సంబంధాన్నిగురించి పెద్ద పెద్ద లెక్చర్లిచ్చేది. ప్రేమించి పెళ్లిచేసుకుంటేనే దాంపత్య జీవితం స్వర్గతుల్యమవుతుందని వాదించేది. మాటలకూ, చేతలకూ వ్యత్యాసం చాలావుంటుందని వాదించిన స్నేహితురాళ్లతో తాను ప్రేమించే పెళ్లిచేసుకుంటానని పందెంవేసింది. కాని, తనిప్పుడు చేసిందేమిటి?

పెళ్లిచేసుకుంది శంకరాన్ని.
ప్రేమించకుండానే పెళ్లిచేసుకుంది.
పరిస్థితులకు తలవంచింది.
జీవితంలో తొలిసారిగా ఓటమిని అంగీకరించింది.

పెళ్లిచేసుకున్నందుకు కాదు!
ప్రేమించడంలోనే!

తను కోరుకున్న వ్యక్తిని పొందకపోవడంలోనే!

తను చదువుకుంటున్న రోజుల్లో ఎందరో విద్యార్థులు తనవెంట పడేవారు. తనని యింటివరకూ దిగబెట్టేవారు. వాళ్లనిచూసి తనలోతానే నవ్వుకునేది వాళ్లల్లో ఏ ఒక్కరూ తన నాకర్షించలేకపోయేరు. ఏఒక్కరూ తన ఆశయాలకూ, అభిరుచులకూ సరితూగే వారుకాదు.

తన ఆశయాలకూ, అభిరుచులకూ సరిపడినవ్యక్తి ఒక్కరే!

తన హృదయంలో పవిత్రస్థానాన్ని కల్పించింది ఆ ఒక్కమూర్తికే!

అతనికోసం, అతనిపొందుకోసం అహర్నిశం భగవంతుణ్ణి ప్రార్థించింది. అతని జీవిత భాగస్వామినిగా అతనినీడలో నడుస్తూ, అతని కష్టసుఖాల్లో భాగం పంచుకుంటూ, జీవితంలో అన్నిరుచులనూ అనుభవించాలని యువ్విళ్లూరింది.

తనహృదయ పీఠాన్ని అలంకరించడానికి అర్హత పొందిన ఆవ్యక్తి సారథి.

సారథి కస్తూరి పనిచేస్తున్న ఆఫీసులోనే గుమాస్తాగా వుంటున్నాడు. మంచిచదువూ, సంస్కారం వున్నవాడు. సారథి రూపానికీ, గుణానికీ మచ్చచూపడం ఎవరికీ చేతకానిపని. తనమంచితనంతో తోటి గుమాస్తాల తలలో నాలుకగా వుంటాడు. ఆఫీసులో ఎంతక్రమబద్ధంగా పని చేస్తాడో, సహపాటులతో కలసిమెలసి తిరగడంలో అంత హుషారునూ, చలాకీతనాన్ని ప్రదర్శిస్తాడు. గిలిగింతలు పెట్టేటట్లుండే అతని కమ్మనిమాటలు ఎంతటి కఠకు మనిషినైనా యిట్టేకవ్వించి నవ్విస్తాయి. అందుకే సారథి అంటే ఆఫీసులో పైనుంచి క్రిందివరకూ అంతా ఎంతో అభిమానిస్తారు. ఆఫీసులో అధికార్లకు సారథి ఎంతచెబితే అంత. అతనిమాటను ఎవరూకాదనరు. సారథి ఆఫీసుకు రానిరోజు ఆఫీసులో ఏదోవెలితి కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది.

అలాంటి సారథి తను ఆఫీసులో చేరిననాడే తనకు పనినేర్పడానికి నియుక్తుడయ్యాడు.

సారథితో ప్రథమ పరిచయం కలిగినప్పుడే తన హృదయతంత్రులు స్పందించాయి. అతని తొలిపపలుకులకే తను పరవసించిపోయింది. తన హృదయాన్ని సారథికి అర్పించింది. ఆ క్షణంనుంచే తను అతని సరసను కూర్చోవాలనీ, అతని మాటలలో మనసు మరచి, అతని నవ్వులలో తేలిపోయి, ఏవేవో సుందర తీరాలకు తరలి పోవాలని వూహించుకుంది. ఆ రాత్రి తాను సుందర స్వప్నాలనుకని ఎన్నెన్ని తీయతీయని అనుభూతులు పొందలేదు? తన ఆశయాలు సుసాధ్యం చేసుకునే తరుణం ఆసన్నమైందని తానెంతగా వుప్పొంగి పోయింది!

తను ఏముహూర్తంలో తన తలపులలో వలపు నింపుకున్నదో కానీ, అతిస్వల్పకాలంలోనే సారధికి అతిసన్నిహితమయింది. అతనియందు తన ఆపేక్షను ఎంతగానో వృద్ధీ చేసుకుంది. సారధికూడా ఏనాడూ తన ప్రవర్తనపట్ల అడ్డుచెప్పలేదు. తామిద్దరూ కలసి జంటగా ఒంటరి ప్రదేశాలకు షికార్లు, సినిమాలకు వెళ్ళేవాళ్లు. ఎన్నో సాయంసమయాలు పార్కులో చుక్కలతళుకులతో అందాలు చిందుతున్న నీలాకాశపు ఛాందినీ క్రిందనో; వెన్నెల వెలుగులలోనో; హాయిగొల్పు చల్లనిగాలులుతెచ్చే కమ్మని పూల గుబాళింపులు మత్తెక్కిస్తూవుంటే; ఒళ్లుపులకరించే కమ్మని సంగీత గీతాలు రేడియోనించి వస్తూంటే వింటూ హాయిగా గడిపేవారు. ఆ వేళల్లో తనను తానే మరిచిపోయేది. తాను అతని హృదయ ద్వారాన్ని చేరుకోడానికి ఎంతగానో ప్రయత్నించేది. కాని సారధి తనకేమీ పట్టనట్లుగానే వుండేవాడు. ఎన్నో మార్లు తన హృదయంలోని మాటను అతనికి చెప్పాలనుకునేది. ప్రేమసంకేతాలను కూడా ప్రసరింపజేసింది తాను. కాని, సారథిలో ఏ చలనమూ కలగలేదు. అతని ప్రవర్తనలో మార్పురాలేదు. తనపట్ల సారధి చూపుతున్న అభిమానం రోజురోజుకు యినుమడిస్తున్నదే కాని, తరగడంలేదు. ఈ పరిస్థితి తనని మరింతగా వేధించసాగింది. సారధి మనస్సును తెలుసుకోవడం తనకు అసాధ్యమయింది. తనవేదననూ, మనసులోని బాధనూ సారధికెలా తెలియపర్చాలో తెలియక సతమతమయ్యేది తను. యిదే తనకు సంధ్యావస్థ.

ఈ సంధ్యావస్థలో.........

రోజులు, నెలలు గడిచిపోతూనే వున్నాయి. కాలంతో పాటు వయస్సుకూడా గడిచిపోతూంది. వ్యక్తులు తమ గురించి తాము పట్టించుకోనంత మాత్రాన లోకం వూరుకుంటుందా?

కస్తూరి వివాహం లోకానికి సమస్య అయికూర్చుంది. కస్తూరితరువాత ఆడపిల్లలుకూడా ఎదిగి వస్తుండడంతో

తలిదండ్రులకి కస్తూరిబరువు తెల్సింది. ఆరవై ఏళ్లపాటు చూపిన వాత్సల్యమూ, పెంచుకున్న ప్రేమనుబంధాలను ఒక్కమారుగా త్రెంచి వేయాల్సివచ్చింది. ఆడపిల్లల్ని కన్నవాళ్లకి యిలాటిస్థితి ఎప్పుడో ఒకప్పుడు తప్పదు. కస్తూరి తండ్రి కాళ్లను ఎన్నో చెప్పులరిగిపోయేయి. ఫలితం మాత్రం దక్కలేదు. కట్నాలపువాచి అతని కంఠానికి కస్తూరిరూపంలో కాలపాశం అయింది. ఎలా అయినాసరే కస్తూరిని వదుల్చుకొని, మిగతా పిల్లల భవిష్యత్తునుకూడా ఆలోచించాలనుకున్నాడాతడు.

అదేసమయంలో కస్తూరి మేనమామ, శంకరం సంబంధాన్ని తీసుకొచ్చాడు. శంకరం బాగా చదువుకున్న వాడనీ, ఎక్కడోదూరంగా రైల్వేలో మంచిఉద్యోగాన్ని చేస్తున్నాడని చెప్పేడు. భుక్తికి లోటులేకుండా అంతో యింతో ఆస్తికూడా వున్నదన్నాడు. ఆ స్తికి అతనొక్కడే వారసుడనికూడా చెప్పేడు. ఆయింటి కోడలయ్యేభాగ్యం కస్తూరిపొందితే, ఆమెజీవితం మూడుపువ్వులూ, ఆరు కాయలుగా శోభిల్లుతుందని అన్నాడు.

ఈవార్త యింటిల్లిపాదినీ ఆనందంలో ముంచి వేసింది. పైగా కట్నం యివ్వఖ్ఖర్లేని ఈసంబంధానికి మురిసిపోయి వాళ్లంతా, కస్తూరిని సంప్రతించకుండానే పెళ్లినిశ్చయించి ముహూర్తం పెట్టించారు.

"ఆయింట్లోని అందరికీ చుక్క పొడిచినట్లని పించింది. కాని, కస్తూరికి ఆ చుక్క తోకచుక్కలా తోచింది. కారణం? తనహృదయాన్ని సారథికి అర్పించ డంచేత శంకరాన్ని పెళ్లిచేసుకోడానికి మనస్సు ఒప్పు కోలేదు. అదీకాక, తన ఆశయాలకు విరుద్ధంగా ముక్కూ మొహం తెలియని వ్యక్తిని పెద్దల అభీష్టాల ప్రకారం పెళ్లిచేసుకొని సంఘానికి బలికావడం తనకు సుతరామూ మనస్కరించలేదు. తనను తాను వంచించు కోలేదు. ఎలా అయినా ఈసంబంధాన్ని వ్యతిరేకించా లనుకుంది. తన హక్కులను, ఆదర్శాలను సంరక్షించు కోవాలనుకుంది. లోకం ఎదిరించినా సరే తనేలోకాన్ని వదిలి సారథితో ఎక్కడో, దూరంగా, కలకాలం ప్రేమ రాజ్యాన్ని ఏలాలనుకుంది.

తన పెళ్లివిషయం తనకు తెలియబరిచినప్పుడు వెంటనే ఏసమాధానం చెప్పలేకపోయింది తను. అందుకు కారణం సారథి తనపట్ల చూపుతున్న వైఖరే. తను సారథిని ప్రేమిస్తున్నట్లుగా, అతను తనను కోరుకుంటున్నాడో, లేదో తనింతవరకూ తెలుసుకోలేక పోయింది. ఏనిర్ణయానికీ వచ్చేముందు సారథితో మనసు విప్పి మాట్లాడాలనుకుంది తను. తన జీవితం ఎడారి కాకూడదు. తన అందం అడవిన కాచినవెన్నెలకారాదు. తన ఆశలు, ఆదర్శాలు వమ్ముకాకూడదు. ఏమేమో అనుకుంది. తనలో అప్పుడు ఆవేశం, ఆవేగం పుట్టు కొచ్చాయి. ఆనాడే సారథితో మాట్లాడి తనభవిష్యత్తు నిర్ణ యించుకోవాలనుకుంది తను.

తను ఆనాడు ఆఫీసుకెళ్లిందన్న మాటేకాని ఏపని చెయ్యలేక పోయింది. తనని వేధిస్తున్న సమస్య తన హృదయాన్ని రంపపుకోతలు కోస్తూ మరింతగా బాధిం చింది. ఎంతత్వరగా సారథికి తనమనసులోని మాటను చెబుతానా అని వేగిరపడసాగింది. నిముషం ఒక యుగంలా గడుస్తున్న గడియారంకేసి మాటిమాటికీ చూడసాగింది.

బాధలతో, సమస్యలతో సతమత మవుతున్న మాన వునికి కాలం బరువుగా నడుస్తున్నట్లనిపించడం అబ్బు రంకాదు.

తను ఆసాయంత్రం ఎలా అయితేనేం ధైర్యాన్ని కూడగట్టుకుని తనమనసులోని మాటను సారథికి చెప్పింది. అతనిని మనసారా ప్రేమిస్తున్నానని చెప్పింది. తనకు పెద్దలు కుదిర్చిన సంబంధాన్నిగురించి సారథికి తెలియజేసి, తనని ఈఆపదనుంచి కాపాడమని వేడు కుంది.

తన మాటలువిన్న సారథివెంటనే బదులు చెప్పలేదు. తమమధ్య కొన్నినిముషాలు నిశ్శబ్దం నిలిచింది.

సారథి నిశ్శబ్దాన్ని చీలుస్తూ పెదవులిప్పాడు. దీర్ఘంగా, గంభీరంగా అతనాడినమాటలు తనగుండెల్లో పొడుచుకుని తననింకా బాధ పెడుతున్నాయి.

"కస్తూరి: నీహృదయంలో బాధనూ, నీవు నామీద చూపుతున్న అనురాగాన్ని అర్థంచేసుకోగలను. ఈ యుగంలో మనబోటి యువతీయువకులకు ఆశయాలు, ఆదర్శాలూ వుండడం హర్షించదగినదే. కాని, మనం ఏపని చేయాలనుకున్నా, చేస్తున్నా మనం మసలుతున్న వాతావరణాన్నీ, మనచుట్టూవున్న సమాజాన్నీ మరిచి పోకూడదు. ఏకారణం చేతనో మన పూర్వీకులు కొన్ని సాంప్రదాయాలను నెలకొల్పారు. అవి సవ్యమైనవేనని నాకు నమ్మకంవుంది. ఏతల్లిదండ్రులూ తమపిల్లల భవి ష్యత్తు నాశనం కావాలని కోరుకోరు. మనజీవితాలు సుఖమయం కావాలంటే- ఎట్టి పరిస్థితుల్లోనైనా వాటిని అనుసరించక తప్పదు. ప్రేమకు పెళ్లిచేసుకోవడం

ముఖ్యంకాదు. త్యాగం చెయ్యగలిగినప్పుడే 'ప్రేమ' శబ్దానికి పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది. మనమధ్య ఏర్పడిన ఈ ప్రేమబంధాన్ని మనం సాఫల్యం చేసుకోవాలనుకుంటే, నిదానం అవసరం. ఈ ఒక్క మంచిపనివల్ల దీనిప్రభావం ఎందరువ్యక్తులమీద ప్రజ్వరిల్లుతుందో ఆలోచించావా? మనసౌఖ్యంకోసం ఎన్నోజీవితాలు నాశనం కానుంటే ప్రేమకు పవిత్రత ఎక్కడిది? స్వార్థంతో కూడిన సౌఖ్యంకంటె. స్వార్థరహితమైన త్యాగంమేలు. ఈసత్యాన్ని ఆలోచించగలగడానికి మనకుకావలసినంత విద్య, విచక్షణా జ్ఞానాలున్నాయి. అదీకాక మన వివాహానికి మనపెద్దలు ఒప్పుకుంటారన్న నమ్మకం మనకుందా? అందుకుకారణం మనల్ని మనకులాలు వేరు పరుస్తున్నాయి. సంఘాన్ని కాదని మనం బావుకునే సౌఖ్యాలేవిటి? మనజీవితాలు లోకంపళ్ల మధ్యనలగడం మంచిదికాదు. మననుంచి మనకుటుంబాలు సంఘంలో అపహాస్యాలు పాలుకావడం మనం వాంఛించకూడదు. అంతేకాక, యిన్నాళ్లూ నిన్ను స్నేహితురాలిగానే చూసానుకాని, అంతకంటె ఎక్కువగా ఆలోచించలేదు. నన్నుపూర్తిగా అర్థంచేసుకుంటావనే నమ్మకం నాకుంది. జీవితాంతం మనం స్నేహితులుగానే జీవించాలని కోరుకుంటున్నాను."

సారథిమాటలు విన్న తను అతనలాటి జవాబిస్తాడని ఎన్నడూ వూహించలేదు. అతనిమాటలు పెనుగాలులై తనుకట్టుకున్న సుందరహర్మ్యాలను పునాదులతోసహా కూల్చివేసేయి. తనమనసులో, హృదయంలో ఒక్కసారిగా భయం, ఆందోళన, అనుమానం, అసహ్యం, కక్ష, ఈర్ష్య, ద్వేషం, కఠినం, కార్పణ్యం, దయ, సానుభూతి అన్నీ సుడిలోపడినట్లు చుట్టుకొని కల్లోల పరిచాయి.

ఈపరిస్థితుల్లో మావయ్యతెచ్చిన సంబంధానికి ఒప్పుకుంది. శంకరాన్ని చూసికాదు, సారథిమీద కక్షకొద్దీ.

నాటినుంచి సారథిని చూడాలన్నా, అతనితో మాట్లాడాలన్నా తనకి అసహ్యంవేసేది. అతను కనపడితేచాలు ముఖం చాటు చేసుకునేది. రేపు పెళ్లనగా ఆసాయంత్రం ఉద్యోగానికి రాజీనామా యిచ్చి యిల్లుచేరుకుంది. ఏదో పెద్దబరువుతీరి పోయినట్లనిపించింది తనకు.

తనిప్పుడు శంకరాన్ని పెళ్లిచేసుకుంది. శంకరమే తన సర్వస్వమూను. శంకరంకూడా చదుపుకున్నవాడూ, మంచిఉద్యోగం చేస్తున్నాడు కూడాను. పైగా ఆస్తికూడా వుంది. తన సర్వస్వాన్నీ అతనికి అర్పించి, అతని కష్టసుఖాల్లో భాగంపంచుకుంటూ, ఆతన్ని ఆనందపరిచి తను ఆనందంపొందుతుంది. తను శంకరంతో సుఖంగా, సంతోషంగా కాపురం చేస్తుంటే సారథి అసూయ చెందుతాడు. తనుచేసిన పొరపాటుకు తననే నిందించుకుని బాధపడతాడు. అతను బాధపడటమే తనకుకావల్సింది. అప్పుడుకాని ఆనాడు తనుపొందిన మనోవ్యథను అతను అర్థంచేసుకోలేదు.

ఏవేవో ఆలోచనలతో, తలపులతో కస్తూరి హృదయం వుప్పొంగిపోయింది. ఆమెను సిగ్గు ముంచెత్తింది. సిగ్గుతో తలవంచి, పైటచెంగును వ్రేలికి చుట్టుకుంటూ, తనలో తానే నవ్వుకుంటూ, ఏవేవో అనుభూతులను పొంద సాగింది–

శంకరం కస్తూరి భుజంమీద చెయ్యివేసి, చుబుకాన్ని స్పృశించేవరకూ ఆమె ఈ లోకంలోనే లేదు.

అతని స్పర్శతో ఆమె పులకించి పోయింది.
అతనామెనుహృదయానికిదగ్గరగా తీసుకున్నాడు.
అతని గుండెలో ఆమె తన తలను దాచుకుంది.

"నేనెంతో అదృష్టవంతుణ్ణి కస్తూరీ" అన్నాడు శంకరం.

శంకరం మాటలు కస్తూరి మనస్సుకెంతో హాయిగొల్పాయి. "మిమ్మల్ని పొందినందుకు నేను మాత్రం కానూ!" అంది కస్తూరి అప్రయత్నంగా.

శంకరం కస్తూరిని తన సరసన మంచంమీద కూర్చోబెట్టుకున్నాడు.

శంకరం అన్నాడు. "చదువుకున్న భార్యలతో కాపరం చెయ్యడం కష్టమని" సరసంగా.

"ఏం?" ప్రశ్నించింది కస్తూరి.

"వాళ్లకు భర్తల యిష్టాయిష్టాలతో ప్రమేయం వుండదు. ఎంతసేపూ వాళ్లధ్యాస వాళ్లదే" అన్నాడు అతను.

"అందరిలా వూహించకండినన్ను. మీకోసం నన్నేం చెయ్యమన్నా చేస్తాను" ఆమె జవాబిచ్చింది.

"అయితే నువ్వు యిక ముందుకూడా ఉద్యోగం చెయ్యదల్చుకున్నావా?" శంకరం అడిగాడు.

"లేదు. మొన్ననే రాజీనామా యిచ్చాను" అంది కస్తూరి. తన మాటలకు భర్త పొంగిపోతాడనుకుంది.

"ఉద్యోగానికి రాజీనామా యిచ్చావా?" శంకరం ముఖంలో భయం, ఆందోళన తాండవించాయి.

శంకరం ప్రశ్నకు కస్తూరి బిత్తరపోయింది. "ఏం? తప్పుపనేమీ చెయ్యలేదే" సంజాయిషీ చెప్పుకోబోయింది.

"అదికాదు. యిద్దరమూ నిరుద్యోగులమైతే రేపట్నుంచీ ఎలా గడుస్తుంది? అదే ఆలోచిస్తున్నాను" మెల్లగా అన్నాడు, శంకరం.

"మీరు నాతో హాస్యాలాడుతున్నారు. నిజంచెప్పండి. మీరు ఉద్యోగం చెయ్యడంలేదూ?" అమాయకంగా అడిగింది కస్తూరి.

"నేనా ఉద్యోగం చెయ్యడం? ఎవరుచెప్పారు నీకు?" ఎదురుప్రశ్న వేసాడతను.

ఈసారి కస్తూరి నిలువునా నీరయిపోయింది. ఆమెలో భయావేశాలు పొంగుకొచ్చాయి. "మీరు ఉద్యోగం చేస్తున్నారని మామయ్య చెప్పాడే! బ్రతకడానికి వీలైనంత ఆస్తివున్నదన్నాడే! ఆస్తికి మీరొక్కరే వారసులన్నాడే! యివన్నీ అబద్ధాలేనా?" కంపించిపోతూ అడిగింది కస్తూరి.

కస్తూరి మాటలువిని శంకరం నివ్వెరపోయేడు. "అయితే అబద్ధాలు చెప్పి, నీ జీవితాన్ని అన్యాయం చేశారన్నమాట. నీవు చెప్పిన దానికి భిన్నంగావుంది నాపరిస్థితి." అంటూ ఆలానే మంచంమీదా వాలిపోయేడు. తనమూలంగా మరో అమాయక హృదయం అన్యాయం పాలయినందుకు శంకరం హృదయం క్షోభించింది.

భర్త మాటలువిన్న కస్తూరికి మీద పిడుగు పడినట్లనిపించింది. తన జీవితం సర్వనాశనమైనట్లు తలపోసింది. తనేం పాపం చేసిందని తనపట్ల తనవాళ్ళందరూ కక్ష వహించారు? తననెంతో గారాబంగా పెంచిన తల్లిదండ్రులే యిలాంటి పనికి పూనుకున్నారంటే నమ్మలేకపోయింది. కారణాలను వూహించుకోలేక పోయింది. వూహించడానికి ఆమెమనస్సు పనిచేసే స్థితిలో లేదు. ఆమె ముందు భవిష్యత్తు పెద్ద అఘాతంగా నిల్చునట్లయింది. అగ్నిసాక్షిగా తనను శంకరంతో కలిపి ముడివేసింది లోకం. ఈ బంధాన్ని తేలికగా తప్పించడం సాధ్యంకాని పని. తను బంధంనుండి విముక్తి కావడానికి రెండే మార్గాలున్నాయి. జీవితాంతమూ తను పెళ్లాడిన వ్యక్తితో కష్టాలను భరించడం; లేదా ఆత్మహత్య చేసుకోవడమూ.

'ఆత్మహత్యను' గురించి తలుచుకునేసరికి ఎలాంటి విపత్కర పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కొని జీవిత సమస్యలను పరిష్కరించుకోవాలని ఆనాడు సారధి అన్నమాటలు స్ఫురణకొచ్చాయి. ఆత్మహత్య మహాపాతకమనిపించిందామెకు. సారథి మాటలు ఆమెకెక్కడలేని ధైర్యాన్నిచ్చాయి "మొండికెత్తి బ్రతకాలి. అంతకంటె వేరేమార్గంలేదు. తమ సంసారాన్ని తానే చక్కదిద్దాలి" అనుకుంది కస్తూరి.

కస్తూరి మనస్సులో సారథి మెదిలాడు. ఆమె మనసు అతని గురించి ఆలోచించసాగింది.

"తను ఈ గడ్డుపరిస్థితుల్నించి బయటపడాలంటే అందుకు సారథి ఒక్కడే సహాయం చెయ్యగలడు. సారథి మాటంటే ఆఫీసరుకు వేదవాక్కు. అతనెంత చెబితే అంత, సారథికి చెబితే తన రాజీనామాను ఉపసంహరించుకోడానికి వీలవుతుంది. సారథికి విశాల హృదయం వుంది. తనపట్ల సానుభూతి చూపగలడు. తను ఏం కోరినా సంతోషంగా చెయ్యగలడు. సారథికి తన పరిస్థితిని చెప్పి సహాయం చెయ్యమని అర్థించాలి. తను అతని పట్లప్రదర్శించిన వైఖరికి క్షమార్పణ చెప్పుకోవాలి" అనుకుంది కస్తూరి.

కస్తూరి సారథిని గురించి స్నేహభావంతో అనుకుందో అమె హృదయంలో ఏదో పెద్దబరువు తొలగినట్లు అనుభూతిని పొందింది. తనముందు అంతకుముందు నిల్చున్న సమస్యలన్నీ మంచులా కరిగిపోయేయి.

తేలికైన హృదయంతో శంకరం పాదాలదగ్గర అలానే వాలిపోయి నిద్రాదేవి ఒడిలోకి వొరిగి పోయింది కస్తూరి.

---

# ఆంధ్రమహిళ

## శ్రీమతి కె. పార్వతీదేవి

తల్లి, చెల్లి, వదిన, తనయవు భార్యవు
నీవు లేనిచోట నేమిగలదు?
మధుర మైన దమ్మ! మగువజన్మంబిల
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

వలదు స్త్రీకి మంచి వ్యాయామ మనుకోకు
దేహ సౌఖ్యమున్న దిగులులేదు
ఎంత యున్నగాని ఏమిలాభములేదు
అమల గుణవిశాల! ఆంధ్రమహిళ!

ఆడపిల్ల నంచు అదరకు బెదరకు
ఆడయన్నతోడ అలుసులేదు
ఆడయన్న లింగ అంతరంబేగద!
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

'స్త్రీ'కి వలెను సిగ్గు సింగారమొలుకగ
'స్త్రీ'కి వలెను గొప్ప సీల పటిమ
'స్త్రీ' యె ఇంటిలక్ష్మి జీవిత మాధురి
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

చదువు చదివినంత సార్థ క్య మేమిటి?
మట్టిలోన ధనము పెట్టినట్లు;
దాని సారమెరిగి ధైర్యానమన వలె
అమల గుణవిశాల! ఆంధ్రమహిళ!

క్రమము శిక్షలేని కార్యాలు చెడిపోవు
గట్టులేని వాగు కదలినట్లు;
కానముందు నీవు క్రమముగా మెలగాల
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

అన్నపాన మందు అశ్రద్ధచేయక
కాల క్రమముతోడ మెలగవలయు
మితము కంటె వేరు మిత్రులు ఎవరమ్మ!
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

మేడమీద నున్న మేడ నీడన నున్న
మానవత్వ మొకటె మార్పులేదు.
సర్వమాన వాళి సమబుద్ధి గనుమమ్మ!
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

కలుష భావమెపుడు కలుగగా నీకుము
కష్టపడును మనసు కలత జెందు
నిత్య సంతసమున నిండుగా నుండుము
అమల గుణ సుసీల! ఆంధ్రమహిళ!

పొరుగు వారితోడ పోటీలు పడకుము
పొరుగు వారితోడ పొందువలయు
ఇరుగు పొరుగు యన్న ఇంటిలో వారమ్మ!
అమల గుణ విశాల! ఆంధ్రమహిళ!

# పుష్కరం నాటి మాట

## శ్రీమతి వై. సీతానాయుడమ్మ

తల్లి ప్రేమలో, కరుణలో, ఆదరణలో బిడ్డలంతా సమానమైనట్లు ఆంధ్రమహిళకు తల్లిప్రేమలో, కులవివక్షణ, బీద, వున్నవారు అనే తారతమ్యం చూపకపోవటం మరింత విశేషం. ఒక ఆంధ్ర సోదరీ మణులకేకాక ప్రతిసోదరీమణికిగూడ గర్వకారణమని చెప్పకతప్పదు.

12 సంవత్సరాలకు పూర్వం అనుకుంటాను నేను గూడా ఒకవిద్యార్థినని చెప్పుకోవటానికి గర్వపడు న్నాను. అప్పటికి యిప్పటికి ఎంతమార్పు వచ్చిందో మాటల్లోచెప్పాలంటే కష్టం. నేను అంతకిపూర్వం 2 సంవత్సరాలుగా మైలాపూరు కాన్వెంటులో హాస్టల్లో వుంటున్నాను. మావారు అమెరికా వెళ్లటంవల్ల కాలం గడవటం కష్టమనిపించి ఒక బెల్జియం స్నేహితురాలి ద్వారా నేనక్కడ చేరటం జరిగింది, నాస్నేహితులు కొందరు ఆంధ్రమహిళలో చదువుతూవుండేవారు. వాళ్ల ద్వారా నేను ఆంధ్రమహిళ కబుర్లు వింటూవుండేదాన్ని. ఆంధ్రమహిళ అంటే, భర్తవిహీనులకని, అది ఒక బీదలకు నిలయమని చెప్తుండేవారు. ఒకరోజు నా స్నేహితులతోబాటు ఆంధ్రమహిళకు వెళ్లటం జరిగింది. అప్పుడు జమునాబాయిగారు సెక్రటరీగా వుండేవారు. చెన్నగంటమ్మగారు సహోపాధ్యాయులుగా వుంటూ వుండేవారు. వారికి నన్నుపరిచయం జేయటం జరిగింది. నాకెందుకో చదవాలనే కోరిక ఒక్కసారిగా కలటంతో జమునాబాయిగారి ప్రోత్సాహంవల్ల నేను సీనియర్ క్లాస్‌లో చేరాను. అప్పుడేక్రొత్తగా క్లాసులు ప్రారంభించారు. దుర్గాబాయిగారు ఒకరోజు ఆంధ్రమహిళకు రావటం క్రొత్తవిద్యార్థినులను, ఆమెకు పరిచయంచేయటం జరిగింది. నన్ను మర్యాదగా దగ్గరికిపిలిచి,— ఏమమ్మా, నీభర్త ఏమిచేస్తున్నారు అమెరికాలో—అనిఅడిగారు. 'చదువుతున్నారండి' అన్నాను. ఆయనగారు అక్కడ డిగ్రీపుచ్చుకునే సరికి నీవిక్కడ పట్టా పుచ్చుకోవాలిసుమా అంటూ ప్రేమగా నాభుజంతట్టారు. నాకు క్రొత్తకాదూ, ఏమీ మాట్లాడక నవ్వి వూరుకున్నాను.

ఇక క్లాసులో రకరకాలవాళ్లూవుండేవారు. బెంగాలీలు, గుజరాతివాళ్లు, తమిళులు, ఆంధ్రులు, కన్నడులు, అన్ని రకాలవాళ్లూ వున్నారు. ఒక్కమాతృభాష మినహా అన్ని క్లాసులకు అందరం హాజరవుతుండేవాళ్లం. అందరం ఎంతో అప్తులంగా వుండేవాళ్లం. అంతానన్ను సీతాదేవి గారూ అని దీర్ఘంగా పిలుస్తుంటే నవ్వొస్తుండేది. పరీక్షలు దగ్గర్కివచ్చాయి. బెనారస్ ప్రయాణాల్కి అంతా హడావుడిగావున్నారు. టీచెర్సు, స్టూడెంట్సు అందరం కలసి 40 మందిమి వున్నాం. మాతోబాటు ఆ సంవత్సరం జమునాబాయిగారురావటం మరింతవిశేషం. ఆమెగారంటే మాఅందర్కి ఒకవిధమైన గౌరవభావం. భయభక్తులూ వుండేవి. రైలుఎక్కిన దగ్గరనుండి దిగే వరకు అనుకోనంత హాయిగా జరిగిపోయింది ప్రయాణం. అంతా ఒక ప్లానింగు ప్రకారం వుండేది. రెండురోజులు రైల్లోప్రయాణం శ్రమ అనిపించలేదు. నాకిప్పటికి మరుపురాదు. ఎంతహాయిగా వున్నదో చెప్పలేను, స్నేహితులు ఒకచోటచేరి కబుర్లు చెప్పుకోవటం. చదువుకోవటం, మధ్యలో టీచరుగార్ని ప్రశ్నలువేస్తూ విసిగించటం చాలా బాగున్నది మాప్రయాణం. ఇటార్సి వచ్చినదగ్గరనుండి హిందీ మాట్లాడేవారు. బెనారస్ వెళ్లినదగ్గరనుండి హిందీతప్ప ఏభాషా మాట్లాడేవారు కాదు. ఆ హిందీభాష, ఆ చపాతీలు, ఆ పుర్లగడ్డకూర, రసగుల్లాలు యిప్పటికి కథలులాగా జ్ఞాపకం వస్తుంటాయి నాకు. మన ఆంధ్రులంతా ఆవకాయ, పచ్చళ్లు తెచ్చుకోవటం వల్ల మాతిండికి బాధనిపించలేదు. మాపరీక్షలన్నాళ్లు ప్రత్యేకంగా వంటచేయించారు. పరీక్షలు అయిపోయినవి. వూపిరి పీల్చుకున్నట్లుగావుంది మాపని.

అక్కడి విద్యార్థినిలు మాకు డిన్నరు యిచ్చారు. డిన్నరు పార్టీలో ఎక్కువగా మట్టిసామాన్లు వాడుతూ వుంటారు. కప్పులూ గ్లాసులు, అన్నీ మట్టివే. ఉపయోగించుకున్నతర్వాత కుప్పలో వేస్తువుంటారు. మాకు ప్రాణం వుసూరుమనిపించేది. డిన్నరుతర్వాత బోటింగ్ కెళ్లాం ఆరాత్రి. మరుదినం గంగలో స్నానం చేయటం, దేవాలయాలుచూడటం,పూజలూపునస్కారాలూ ముగించుకున్నాం. బెనారస్ కెళ్లేముందు అలహాబాదులో దిగి యమున, సరస్వతి, గంగా కలిసి ప్రవహించే చోటుకువెళ్లాం. బెనారస్‌లో ఒకచోటునుండి మరొక చోటుకు వెళ్లాలంటే కష్టం. బస్సులుగాని, రిక్షాలుగాని వుండేవికాదు అప్పట్లో. కాని మాకు స్కూలుబస్సు ఏర్పాటువల్ల ఏది చూడాలన్నా కష్టమనిపించలేదు. బెనారస్ హిందూ యూనివర్సిటీ చూట్టానికి వెళ్లాం. యూనివర్సిటీ చేరేసరికి మావారిక్కడ చదివారుకదాని

ఒక్కసారి జ్ఞాపకాన్కి వచ్చారు. ఆ విద్యాలయాల చుట్టూ మామిడితోటలు. పిల్లల్కి మామిడిపిందెలు కోయాలనే ఆతృత తప్ప చూడాలనిలేదు. అక్కడనుండి షాపింగ్ ముగించుకొని మరుదినం సారనాథ్ వెళ్లాం. అక్కడ బుద్ధవిగ్రహం ఎంతబాగున్నదో చెప్పలేను. అక్కడే బుద్ధుడు మొట్టమొదట బౌద్ధమతాన్ని స్థాపించటం. ఆమెట్లన్నీ ఎక్కివెళ్లటం, దిగటం పిల్లలు అలిసిపోయారు. అక్కడే మామిడితోటలు. అంతా మామిడి పిందలన్నీ ఏరుకున్నాం. ఇంతలో ఒకపరదేశి పరుగెత్తుకుంటూవచ్చి హిందీలో మమ్మలని కోప్పడటం మొదలుపెట్టాడు. కాని మాకు హిందీతెలియదు. డబ్బులు యివ్వబోయాం. తీసుకోలేదు. ఎలాగో సమాధానాన్కి వచ్చేసరికి మాతలప్రాణం తోకకి వచ్చింది. ప్రక్కకొట్లో వుప్పుపొట్లాలుకొని ఆమామిడిపిందెలు, ఆ వుప్పు అద్ది తింటూంటే ఎంత రుచిగా వున్న వనుకున్నారూ!

మరుదినం ఢిల్లీప్రయాణం. ఢిల్లీ చేరేసరికి మధ్యాహ్నం 2 గం॥ లైనది. మాకు బస్సులు ఏర్పాటుచేసారు దుర్గాబాయమ్మగారు. సామన్లతోబాటు మేముగూడా బస్సులో చేరగలబడి నెమ్మదిగా ఒకమంత్రిగారి భవనం జేరుకున్నాం. మేమువుంటాన్కి ఒకమంత్రిగారియిల్లు కుదుర్చారు. వాళ్లకుటుంబం వూరికి వెళ్లారట. అక్కడ దిగేసరికి మాకోసం ఫలహారాలు ఎదురుచూస్తున్నాయి. ఆ బోండాలు, కాఫి చూసేసరికి మాకుప్రాణం లేచివచ్చింది. ఒక్కొక్కరం 4, 5 బోండాలుతిన్నాము. పచ్చడి చాలనే లేదు. చపాతీలు వుర్లగడ్డకూర తిన్ననోళ్లకు ఇవి ఎంత రుచిగా వున్నాయో చెప్పలేను. ఇకరాత్రి భోజనంసంగతి వేరేచెప్పాలా, అప్పడాలదగ్గరనుండి మామిడికాయ పచ్చడివరకు మన ఆంధ్రాభోజనమే. నెలరోజులుగా ఆ చపాతీలతో ఆకలితీర్చుకున్నవాళ్లకు మనభోజనం చూసేసరికి గిన్నెలు మిగులుతాయా అనిపించింది. అవి ఒక దక్షిణాది హోటలునుండి వచ్చాయట. దుర్గాబాయిగారి పుణ్యమా అంటూ బస్సులుఏర్పాటు చేసారని చెప్పానుకదూ అవి మాకోసం ఎదురుచూస్తూవున్నాయి ఢిల్లీ చూపించటాన్కి. త్వరగా స్నానాలు ముగించటాన్కి 40 మంది వున్నాం. ఎలా! ప్రక్కన వున్న వారింటికి పంపించారు స్నానాలు చేయటాన్కి. ఆయనగారు ఒక్కరేవున్నారు. కుటుంబం ఆంధ్రాకి వెళ్లారట సెలవల్కి. పాపం ఆయినగారిప్పుడు బ్రతికిలేరు. అందుకే ఆతమాషా వ్రాస్తున్నాను. మొత్తం 10 మందివెళ్లాం. మాకు 5 గదులుచూపించి ఒకొక్కరే స్నానంచేయమన్నారు. 5 గురు స్నానం చేయటాన్కి వెళ్లారు. మిగతా 5గురుం కలుసుకుంటూ బైట నిలబడ్డాము. అంతా ఎవరికివారే ఒక్కనిమిషంలో స్నానంముగించి బైటపడ్డారు. ఏమిటర్రా అప్పుడే స్నానాలు ముగించారు అంటే ఒక్కగదికీ గడియ లేదు, ఒకగదికీ కిటికీ గ్లాసులేదు' అన్నారు మావాళ్లు.

ఢిల్లీలో ముఖ్యంగా చూడవల్సినవన్నీ చూసాం. పార్లమెంటుభవనం, కుతుబ్‌మీనార్, రెడ్‌ఫోర్టు, జంతర్ మందిర్, మొగల్‌గార్డెన్సు, బిర్లామందిర్ ఒక్కటీ వదలకుండా చూసామనే చెప్పాలి. తర్వాత ఆగ్రా బయలుదేరాం బస్సులోనే .మధ్యలో మధురలోదిగి యమునానది. శ్రీకృష్ణభగవానుని జన్మస్థలం చూసాం. యమున దగ్గర్కి వెళ్లగానే పెద్ద పెద్ద తాబేళ్లు కనిపిస్తూ వుంటాయి. వాటిని చూస్తుంటే నదిలోకాళ్లు కడుక్కోవాలంటే భయమనిపించింది. అవి అన్నిచూసి ఆగ్రాచేరుకున్నాం. అక్కడనుండి తాజమహల్ చూటాన్కి వెళ్లాం. ఆతాజమహల్ అందం వర్ణించాలంటే నేను కవియత్రిని కావాలి. అంతా మార్బుల్‌తో కట్టబడింది. షాజహాన్, ముంతాజ్‌మహల్ సమాధులనిండా మొగల్ డిజయన్‌లు చెక్కబడివున్నవి. అక్బరు సమాధి, షాజహాన్ మ్యూజియమ్ అన్నీచూచి నెమ్మదిగా ఢిల్లీచేరుకున్నాం. అక్కడ ఒకరోజు షాపింగ్ అదీ చేసి నెమ్మదిగా యింటికి బయలుదేరాం. మాగ్రూప్ అంతా పాస్‌అయ్యాము 4 గురుతప్ప. నాతో చదివిన రాజేశ్వరి చదవంతాముగించి ప్రస్తుతం అమెరికాలో పనిచేస్తున్నది. ఇది అంతా ఎవరిచలవ? దుర్గాబాయమ్మగారిదే. ఒకొకరి చేయితీరు. పట్టింది బంగారమై దినాదినాభి వృద్ధిగాంచుతుంది. మేము చదివేరోజుల్లోనే అడయార్ నర్సింగ్ హోమ్‌కి శంఖుస్థాపన జరిగింది. అప్పుడా ఆవరణంతా ఒక అరణ్యంగా వుండేది. ఇప్పుడుచూస్తే, అరణ్యాన్కి పూలవనాన్కి వున్నతేడా తేటతెల్లమగుతుంది.

అరణ్యాలనుంచి వుద్యాన వనాన్నీ, మట్టిదిబ్బలనుంచి విద్యా సౌధాలనీ, నిరక్షరాస్యులనుంచి విద్యావంతులనీ తయారుచేసే యీ ఆంధ్రమహిళా సంస్థలో నేనుకూడా పూర్వపు విద్యార్థిననీ, దుర్గాబాయమ్మగారు తొలిరోజున అన్నట్లు మావారు అమెరికానుంచి వచ్చేసరికి నేను కూడా పరీక్ష పాసవగలిగాను అని చెప్పుకునేందుకు గర్వంగావున్నది. ఆంధ్రమహిళా సభ పాతవిద్యార్థినిగా నాఅనుభవాలని నెమరువేసుకుంటూ నన్ను విద్యావతిగా చేసిన ఆసంస్థకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. మొన్న జరిగిన రజతోత్సవాలు చూశాక నాలోంచి యీ భావాలు వాటంతట అవే పుట్టుకువచ్చాయి. అవి కాయితం మీద పెట్టాను.

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the Month of July 1962

**OUT-PATIENT DEPARTMENT:—**

| | |
|---|---|
| No. of Surgical cases treated | 52 |
| " " Medical " " | 972 |
| " " Ante-natal " " | 341 |
| " " Post-natal " " | 97 |
| " " Gyneac " " | 110 |
| " " E.E.N.T. " " | 32 |
| " " Dental " " | 5 |
| Total " " New Patients treated | 1,609 |
| " " " Old " " | 2,064 |
| Grand Total | 3,673 |

**ADMISSION REGISTER:—**

| | | |
|---|---|---|
| No. Patients admitted for Normal Delivery | | 141 |
| " " " " " Abnormal Delivery | | |
| Forcepts | 6 | |
| Ext. Breech | 1 | 7 |
| " " Ante-natal casese False pains Treated | | 29 |
| " " Ante-natal cases Treated Toxeamia " | | 2 |
| " " Medical " " | | 38 |
| " " Post-Natal " " | | 2 |
| " " Gyneac Cases Treated | | 25 |
| " " Surgical Cases Treated | | 2 |
| " " Babies admitted as Lodgers | | 152 |
| Grand Total | | 398 |

(True Copy)

Sd. Dr. K. R. AMBUJA (Sd.) Dr. M. PAVANA BAI (Sd.) B. TIMMABA

Resident Medical Officer

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఅడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్. సి., పరీక్షలకు శిక్షణ.

పారిశ్రామిక విద్యాలయము : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము.

మహిళా మందిరము : విద్యార్థినులకు వసతి గృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

నర్సింగ్ హోమ్ : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడు చున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది.

ఆర్థోపీడిక్ సెంటర్ : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమ కేంద్రం.

ముద్రణాలయము : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు చేయబడును.

నాగేశ్వర శిశువిహార్ : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుప బడుచున్నది.

వనితా బాలవిహార్ : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం

## ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

హైదరాబాదు శాఖ నిర్వహిస్తున్న కార్యక్రమాలు : (1) రీజనల్ హేండిక్రాఫ్ట్సు, (2) సంక్షిప్త విద్యాప్రణాళిక, (3) చేనేత శిక్షణ - ఉత్పత్తి కేంద్రము, (4) పౌర సంక్షేమ కార్యక్రమ పథకము, (5) వసతిగృహము.